# మహారథి

జాస్తి వేంకట నరసింహారావు




కవిరాజ పబ్లిషర్సు
తెనాలి :: సికింద్రాబాదు

# మహారథి

## ప్రథమ ప్రకరణము

అది యొక సుందరోద్యానము. మంజుల పుష్పనికుంజములు మనోహర పరిమళము లీనుచున్నవి. మావికొమ్మలపై కోయిలలు మధురములగు ననురాగ గీతిక లాలపించుచున్నవి. కిచకిచలాడుచు చిన్నారి రామచిలుక తల్లిఱెక్కల క్రింద దాగుకొనుచున్నది. ఆ తోటలో నొక ప్రక్కనున్న కమలకాసారమున రాయంచల జంటలు స్వేచ్ఛావిహారములు సల్పుచున్నవి. ఆ సరోవరము నానుకొని యొక సౌధరాజము విరాజిల్లుచున్నది.

అప్పుడే సూర్యోదయ మైనది. బాలభానుని బంగారు కిరణము లా ప్రాసాదమునకు పసిడిపూఁతలు పూయుచున్నవి. పదిపదాఱేండ్ల సుందరీశిరోమణి యొకర్తుక మెల్లమెల్లగ నా మేడమెట్లు దిగి క్రిందికి వచ్చుచున్నది. అడుగడుగున కామె చరణములు కంపించుచున్నవి. ఆ వెలంది ధరించిన మణిమయ భూషణములును, ముత్యాల మేలిముసుఁగును, జలతారు పట్టుచీరెయును నామె యొక మహారాజ కుమారి యని చెప్పకయె చెప్పుచున్నవి.

కన్యక వలెనే కనిపించుచున్నది. కాని యా లలనాలలామ చిగురుచేతులలో నొక చిన్నిబిడ్డ యున్నట్లున్నాఁడు. స్వరూపసాదృశ్యమును బట్టి చూడ నతఁ డామె సుతునివలె

నున్నాఁడు. ఆ పసిపాపని పాలబుగ్గలలో, వాలు గన్నులలో కన్నతల్లి రూపురేఖలు కనుపించుచున్నవి. ఆమె వినీల నయనములనుండి బాష్పధారలు జాలువారుచున్నవి. ఆమె హృదయ మేలనో కొట్టుకొనుచున్నది. వదనము వైవర్ణ్యము దాల్చినది.

పాపము! ఆమె విచారమున కేమికారణమో? ఆమె నిట్టూర్పులలో నెంత యావేదన యంతర్గతమై యున్నదో? ఆ సుకుమారి మృదుహృదయము తీరని బాధకు గుఱియైన ట్లున్నది!

ఆ బాలుఁడు బాల భాను ప్రభా భాసమానుఁడు. భూమిపై పడిపడకముందే వజ్రకవచమును మణికుండలము లును బహూకృతిగా పొందిన యీ యందాలపాప యెంత యదృష్టవంతుఁడో! ఆ చిన్నారిబిడ్డ నెత్తుకొని యొంటరిగా నా రాకుమారి యెచ్చటికి కరుగుచున్నదో!

బాలసమీరుని ప్రభావమున నామె మేలిముసుఁ గొక్కింత ప్రక్కకు జారినది. సుందరమగు నా వదనార వింవమును గుర్తించినారము! ఆమె కుంతిభోజ ధరాకాంతుని కూర్మితనయ కుంతీకుమారి. ఆ సుకుమారి సుమకోమల హృదయము శోకానుభవమున నెంత కలఁగి పోవుచున్నదో!

ఆ యుద్యానము నానుకొని యశ్వనది యుత్తుంగ తరంగములతో బ్రహ్మాండముగా ప్రవహించుచున్నది. కుంతీ కుమారి బెదరుచూపులతో నా వాహిని నవలోకించినది.

దీనదృక్కులతో కన్నబిడ్డను కనుంగొనినది. ఏమియో తలంచి తల పంకించి యుస్సురని నిట్టూర్చినది. చిట్టిబాబు మాత్రము చిఱునగవుతో కన్నతల్లిని పదే పదే కాంచు చున్నాఁడు. ఆమె పరితాప మా పసిపాప కేమి తెలియును!

ఆ ప్రేమమయి పుత్రుని గద్గదకంఠముతో పలుకరించు చున్నది. ఆ కరుణామయి హృదయవిపంచినుండి యేదియో విషాదగీతి వినవచ్చుచున్నది.

"కుమారా! ఈ యభాగ్యురాలి గర్భమున నీవేల జన్మించితివయ్యా! ఆక్కఱురాని నిన్నిప్పు డెక్కడ దాచి యుంతును తండ్రీ! నిన్నెట్లు రక్షించుకొందును! సుక్షత్రియ వంశప్రసూత నే! మట్టు మర్యాద లెఱిఁగిన మహారాజ కుమారి నే! అభిమానధనుఁడైన యవనీపతి నా యీ యకార్యము నంతఃపుర మహాపరాధముగా భావించి మరణ శిక్ష విధింపకుండు నే! నా మాతృదేవి యవమానపాత్ర నైతినని దుఃఖావేశమున తూలి కూలిపోకుండు నే! బంధు మిత్రు లీ మహాపచారమును సహింతురే! మా వంగదపు గౌరవము గంగలోఁ గలిసిపోదే! చెలికత్తె లీ రహస్యము గ్రహించిరేని నా శీలమునకు తీరని కళంక మాపాదింప కుందురే! ఏమి చేయుదును!

నిర్మల ధర్మపథమునుండి ప్రజానీకము పతనము గాకుండ కాపాడవలసిన భూపాలుని యాత్మజయే దురా చారిణియైన క్షమాపణ ముండు నే! విద్యావినయవివేక

సంపన్న యయ్యును విధికర్మపాకమున విస్మయకర చరిత మహెన్మ్యనని సమాజము సానుభూతిఁ జూపఁజాలదుగదా! కన్నతల్లి కడుపుతీపు హృదయము లేని సంఘమున కెట్లర్థ మగును ?

కుమారా! రాజభోగములతో పెరిగి భర్మసౌధములలోఁ బారాడుదు వనుకొంటినే! వచ్చిరాని మాటలతో ముచ్చట చూపి మోదము గూర్తువనుకొంటినే! ఆటలాడుచు పాటలు పాడుచు మాటలు నేర్చుకొను నిన్నుఁగని సంతసించు సౌభాగ్యము లభించుననుకొంటినే! "అమ్మా!" యను నమృతవాణి నీ యధరములం దలరారునప్పు డే యానందము నందుకొని యుండెడిదాననో గదా !

అక్కటా! ఈ నాటకమునకు నాందీప్రస్తావనగా దుర్వాసమహాముని మా భవనమున కేల రావలయును! వచ్చిన కోపానివర్యుని మాతండ్రి మర్యాదచేసి మా కతిథులు కండని యేల ప్రార్థింపవలయును? మునితల్లజునికి సపర్య సేయుటకు మా జనకుఁడు నన్నేల యాజ్ఞాపింపవలయును? పరిపూర్ణ శ్రద్ధాభక్తులతో నేచేసిన పరిచర్యకు మునిచంద్రుఁ డేల ప్రసన్నుఁడు కావలయును? వాత్సల్య పూర్వకముగా నాశీర్వదించి యతఁ డా దివ్యమంత్రము నా కేల యుపదేశింప వలయును? ఆ మంత్ర మహత్వ పరిశోధనకై బాలభాస్కరుని రమ్మని నేనేల ప్రార్థింపవలయును? బాల్యచాపల్యమునఁ గోరిన నాకోరిక మన్నించి రాజీవబంధుండు నాకడ

కేల రావలయును? వచ్చి..."నీ పవిత్ర చరిత్ర కళంక పాత్రము కానేర"దని వాక్రుచ్చి యీ ముద్దుబిడ్డ నిచ్చి వెడలిపోయెను గదా! ఈ పసిపాపను దక్కించుకొనలేని దౌర్భాగ్యవంతురాలి కేదారియుఁ గన్పింపకున్నది!

కటకటా! ప్రపంచము కన్నుగప్పి యీ చిన్నారి బిడ్డ నెంతకాల మంతిపురమున నజ్ఞాతవాసము సేయుంతును! భగవానుఁడు నన్ని ట్లగ్నిపరీక్షపాలు సేయ నెంచెను గాఁబోలు! దాక్షిణ్యనిధియై విశ్వరక్షణదీక్షాదక్షుఁడై కర్మ సాక్షియైన భాస్కరుఁడు గూడ నా కిప్పట్టున కర్తవ్యము నెఱింగింపకున్నాఁడే! అబలనై యసహాయనైన నే 'నా వేదన' మందుటకన్న నేమి సేయఁగలను? భారతనారీమణి యప ఖ్యాతి భరింపఁజాలదు. అభిమానరక్షణకై యాత్మహత్య యొక్కటే యవశ్య మాచరణీయము. తప్పదు – సర్వదోషాప హారిణి యగు నీ యశ్వనదిలో నా చిన్నిబిడ్డతో చేరిపోయె దనుగాక!"

మానవతీశిరోమణి కుంతీకుమారి మందగమనముతో ముందునకు వచ్చినది. అపూర్వమగు నావేశముతో నశ్వ నదీ తరంగములలో నడుగు వెట్టినది. కన్నెత్తి యొకసారి కమలబాంధవుని గాంచినది. "ఆత్మహత్య మహాపాపము. అదృష్టవంతుఁడైన నీ యందాలపాప నన్యాయముగాఁ జేసే తుల హత్యసేయకుము." అని యంతర్వాణి సేయు గంభీర ప్రబోధ మామెను మేల్కొల్పినది.

తన్నెవరైన కనుఁగొన్న ప్రమాద మాసన్న మగునని కాఁబోలు నామె యప్పుడప్పుడు 'వెనుదిరిగి' చూచుచున్నది.

అంతలో నాయింతి కా స్రవంతికామధ్యమున నల్లంత దూరములో యటునిటు నూఁగుచు నొక పేటిక తీరమునకు వచ్చుట గోచరించినది. కుంతీకుమారి కన్నులలో నాశారేఖ పొడగట్టినది. ఆమె తన కుమారుని పొడవును మందసము పొడవును సరిచూచుకొనినది. నాలుగడుగులు వెనుకకుఁ బెట్టినది. పసిపాపతో ప్రవాహమునఁ బడఁబోవఁ బ్రయత్నించు నా పడతిని పరాత్పరుఁ డనుగ్రహించెనేమో! ఈ పెట్టె పంపి దారి చూపెట్టినాఁడు. భగవానుని దాక్షిణ్యాభావము సంతతమార్తుల కండ యగుచుండును గదా!

ఆ మంజుల మంజూష మెల్లమెల్లగా నా రాచపట్టిని చేరవచ్చినది. మందగతిని ముందునకు వచ్చి మందసమును కుంతీకుమారి తీరమునకుఁ దెచ్చినది. పూలగుత్తులతో బుజ్జి తండ్రికి సెజ్జ తయారు చేసినది. పైచెఱగు చింపి మెత్తగా ప్రక్క పఱచినది. కొమరుని మృదులశరీరమున కొత్తుకొనకుండ నెత్తలిరాకులు పేర్చినది. ఆ పసిబాలుఁడు కిలకిల నవ్వుచు కాలుసేతు లాడించుచున్నాఁడు. అమ్మ కష్ట మా యమాయికుని కేమి తెలియును?

కుంతీకుమారి గుండె దిటవుచేసికొని బిడ్డని కండ్లార చూచికొని యా పూలపాన్పుపైఁ బరుండఁబెట్టఁ బోయినది. కాని ఆమెకు చేతులు రాలేదు. తాను చేయఁబోవుచున్న

దారుణకృత్యమును దలంచుకొని యామె హృదయము ద్రవించిపోయినది. కన్నకొమరుని కరుణమాలి గంగ కర్పింపఁ దలఁచిన తన హృదయకాఠిన్యమును గని భావి ప్రపంచము తన్నెట్లు 'పడదిట్టు'నో యని పరితపించినది. చక్కని తండ్రి నొక్కమాటు ఱక్కునఁ జేర్చుకొని ప్రేమభరమున ముద్దాడినది.

ఒకవంక ప్రియసుతునిపై ప్రేమ. ఒకవంక లోకాపవాద భీతి. కన్న మమకార ముజ్జగించుటా? కాక పరాభవమును వరించుటా? ఆమె కేమియును పాలుపోలేదు. రత్నాల రాశియైన బిడ్డ నొకసారియు, నిత్యనూత్న తేజోవిభాసియైన నీరజమిత్రు నొకసారియు చూచుచు నామె నిస్తబ్ధయై యట్లే నిలచిపోయినది.

అంతలో సమాజము భయంకర పన్నగమై బుసకొట్టుచు పగఁబట్టి ఫణమునెత్తి పైఁబడ వచ్చుచున్నట్టులామె మనోనయనములకుఁ గనిపించినది. గుండెలు రాయి చేసికొని బిడ్డను పెట్టెలోఁ బరుండఁబెట్టి నదిలోనికిఁ ద్రోయఁబోయినది. అనుకంప యతిశయింప నాత్మజుని తిరిగి చేతులలోనికిఁ దీసికొనినది. భరింపరాని విషాదములో కొమరుని కౌఁగిలించుకొని యెక్కుపెట్టున బిట్టు వాపోవసాగినది.

"సర్వసంపత్సమేతుఁడై సకల సుఖోపభోగములతోఁ దులదూఁగుచున్న కుంతి భోజరాజేంద్రుని మనుమనికిఁ దిన తిండి నిలువనీడ లేకపోయెఁగదా! హాతవిధీ! కాలు చెయి

రాని నా కన్నతండ్రిని గంగకర్పించు ఘాతుకురాల నైతినే! అనిర్వచనీయమైన నా మాతృహృదయము నాకిప్పు డర్థమైనది. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డని పెంచి లాలించి పెద్దజేయవలసిన జననియే నదిలోనికి ద్రోసిన చేరదీసి కాపాడువా రెవ్వరు? ఇంతకు నే నేనాడే మాతాశిశువుల నెడబాపితినో యీనాటికీ వియోగ మనుభవింపవలసి వచ్చెను!

తండ్రీ! నిన్నిట నొంటరిగా విడిచిపోవుటకు కాళ్లు సాగుటలేదే! నాయనా! పెట్టెలో పెట్టి నిన్ను నట్టేటిలోనికి నెట్టుచున్నాను. మనకింక ఋణము తీఱిపోయినది. ఐనను నావంటి క్రూరకర్మురాలికి నీవంటి రత్న మెందుకు దక్కునయ్యా! పూర్ణిమాసుధాకరునకు సరిపోవు నీ సుందర వదనారవిందము మరల నీ దౌర్భాగ్యురాలికి నయనానంద సంధాయకము కాగలదా? ఏతల్లియైన చేరదీసి పెంచి పెద్దజేసిన నాటి మాటగదా!

బాలభాస్కరా! నీ చక్కదనాల బిడ్డ నెట్లు సాకెదవో! నీదే భారము. భువనపావనీ! భూదేవీ! నా పుత్రుని రక్షింపవా! జననీ గంగాభవానీ! నా చిట్టిబాబును నీ ప్రేమాంకపీఠ నెక్కించితిని. వీని నెట్లైన కాపాడి యే యనపత్యులకైన నొసంగి బ్రతికింపుమమ్మా!"

కుంతీకుమారి విషాదపరీతచేతస్కయై "వరాలతండ్రీ! నన్ను వదలిపెట్టి పోయెదవా!" యని విలపించినది. ఎట్లు కేలకు

పట్టిని పెట్టెలో బజ్జుండ నెట్టి జోకొట్టినది. ఆతపత్రముగా జలజాతపత్ర మొకటి తెచ్చి బిడ్డ కెండ లగులకుండ నమర్చినది. ఆ యాకులోనుండి పాలబుగ్గలపై కట్టకడపటిసారి ముద్దు వెట్టినది.

"మా నాన్న ననుఁ బాసిపోవుచున్నాఁడు" అనుచు కంపించు కరములతో నా కరుణామయి కన్నులు మూసి కొని నీటిలోనికి పేటికను త్రోసివైచినది.

ఆ నదీమతల్లి తరంగహస్తములలో మందసము ముందుకు సాగిపోయినది. సూర్యనారాయణుని యరుణారుణ కిరణములలో మణిమంజూష ధగధగ లాడినది. ఆ విషాద దృశ్యమును చూడలేక కాబోలు భాస్కరుఁ డొక మేఘ శకలము చాటున ముఖము దాఁచుకొనినాఁడు. ఆ కరుణ దృశ్యమును గాంచలేక కుంతీకుమారి గట్టిగా కన్నులు మూసికొన్నది. ఆమె నయనాంచలములనుండి కవోష్ణా శ్రువులు కపోలములపై జాలువారినవి.

## ద్వితీయ ప్రకరణము

అది హస్తినాపురము. అవి ప్రాజ్యభారతసామ్రాజ్యము నతివైభవముతో ధృతరాష్ట్రమహారాజు పాలించుచున్న రోజులు. కౌరవకులాలంకారుఁడగు ధృతరాష్ట్రున కతిరథుఁ డను మిత్రుఁడు కలఁడు. అతిరథుఁడు మహారాజునకు సారథియై మన్నన లందిన యభిమానధనుఁడు. సూత

వంశోద్భవుఁడు. అతిరథుని యాంత్రేశ్వరి రాధ.

ఆ దంపతులకు సమస్త సౌభాగ్యములును హస్తగత ములై యుండెనే గాని సంతానము మాత్రము లేదు. మిత్రుఁడైన మహారాజు ననుమతిగొని యతిరథుఁడు సతీ ద్వితీయుఁడై యెన్నియో తీర్థయాత్రలు సేవించెను. పుణ్యక్షేత్రములు దర్శించెను. వారు చెట్టనక గుట్టనక పుట్టనక కనుపించిన దేవతకెల్ల మ్రొక్కిరి. వ్రతము లాచరించిరి. భక్తవర్యుల పాదములు భజించిరి. దేవతలను ప్రార్థించిరి.

కాని ప్రియనందన ముఖసందర్శన భాగ్యము మాత్ర మా దంపతులకు లభింపలేదు. పసిపాపల కని పెంచి లాలించి సంతసించు నదృష్టము తనకు లేకపోయెగా యని రాధ చింతించుచుండెడిది. ఇరుగు పొరుగువారి పసిబిడ్డల చేరఁదీసి తాయములు పెట్టుచుండెడిది. పూర్వజన్మకృత దుష్కృత విశేషము కతన తన కనపత్యదోష మావహిల్లెనేమో యని తన్ను తా నోదార్చుకొను చుండెడిది. చిన్నబిడ్డల చిలిపిచేష్టలు కనుఁగొనవలెనని యుత్కంఠితురా లగుచుండెడిది. సుతులు లేక గతులు లేవను సూక్తి విని విషాదయుక్త హృదయ యయ్యెడిది.

ఆ నాఁడు రాధ ప్రాసాదోపరిభాగమున కూర్చుండి తన యనపత్యతను గుఱించి యాలోచించుచుండెను. అప్పు డతిరథుఁడు రాధను సమీపించి సానునయముగా "దేవి! సఫలీకృత మనోరథుల మగుటకై శక్తివంచనలేక శ్రద్ధా

భక్తులతో దేవతలనెల్ల యారాధించితిమి. కాని యే దేవుఁడును కనికరింపలేదు. వాడుక ప్రకారము నేఁడును కామితార్థ ప్రదాత యగు కమలాప్తుని కర్ఘ్యాంజలి ఘటించుటకై గంగ కరుగఁబోవు చున్నాను. సకలశుభసంధాయి యగు సూర్యభగవానుఁ డెప్పటికైన మనపై దయఁ జూపకపోఁడు" అని పలికెను.

నాఁ డేలనో రాధ వదనమున నవ్యకాంతులు నాట్యమాడినవి. హృదయ సరోజ ముత్ఫుల్లమైనది. నాథుని సాదరముగ నవలోకించి "అయిన వేగముగా పోయిరండు" అని మధురకంఠముతో పలికినది.

సూర్యభగవానుఁ డతిరథుని యారాధ్యదైవము. నాఁ డతిరథుఁడు పవిత్రభాగీరథిలో స్నాన మాచరించి భక్తితో ప్రభాకరున కర్ఘ్య మిచ్చినాఁడు. కోరికలు దీరునట్లు జగదాధారుని పరిపరివిధముల ప్రార్థించినాఁడు.

ఇంతలో నొకింత దూరమున గంగాతరంగడోలలలో నూఁగుచు వచ్చుచున్న మంజుల మంజూష యతనికిఁ గనిపించినది. అతిరథుఁ డాశ్చర్యపడుచు నద్దాని పట్టి తెండని సేవకుల నాజ్ఞాపించెను.

తీరమునకుఁ దేఁబడిన మందసమును మహానందముతో నేకాంతముగా తెఱచి చూచి యద్దాన ముద్దులు మూటగట్టు ముత్యాలరాశిని గని యతిరథుఁడు విస్మయమందినాఁడు. దివ్యదీప్తులఁ జిమ్ము నగుమోము తనివిదీర దర్శించినాఁడు.

సహజకవచకుండలాభిరాముండై సౌందర్య మొగంబోయు చున్న బాలుని జూచి యభిలాష దీర్చిన యహర్పతి కభి వందనము లర్పించినాఁడు. బిడ్డను తీసికొని నిజగృహాభి ముఖుఁడైనాఁడు.

రాధ ప్రాణేశ్వరుఁడు తనకై తెచ్చిన వలపుకానుకను గని బ్రహ్మానంద మందినది. అంతులేని సంతోషముతో బిడ్డ నందుకొనినది. దొరకిన తెఱంగు నెఱింగినంతనే పొంగి పొరలు రాధ ప్రమోదబాష్పములు చిన్నిబిడ్డ చెక్కిళ్ళపై జారిపడినవి.

"నాయనా! ఇన్నాళ్ళు నాకన్నులకుఁ గానుపించక యే తెన్నున దాఁగియుంటివోయీ! అంధకారావృతమైన మా గృహమున దివ్యకాంతులు వెదచల్ల వచ్చితివా! తండ్రీ! నీకొఱ కెన్ని వత్సరములు వేచియుంటిని! ఎదురు చూచి కన్నులు వాచిపోయినవే! నా కాంక్ష దీర్ప వచ్చితివా! నా యాశాసౌధము నలంకరింప వచ్చితివా!" అని రాధ ప్రేమస్నిగ్ధహస్తములతో సుకుమారుని శరీరము నిమిరి ముద్దాడినది.

రాధకు గారాబు బిడ్డఁడగుటచే రాధేయుఁ డనియు సువర్ణకవచ సుశోభితుం డగుటచే వసుషేణుం డనియు దివ్య కుండలమండితకర్ణుం డగుటచే గర్ణుం డనియు నా బాలునకు నామకరణము గావింపఁబడెను.

ఇట్లు రాధచే నత్యంతాదరముసఁ బెంచఁబడుచు

కర్ణుఁడు శుక్లపక్ష సుధాంశునివలె దినదిన ప్రవర్ధమానుఁడై విద్యాభ్యాస యుక్తవయస్కుఁ డయ్యెను.

ధృతరాష్ట్రునకు నూర్వురు పుత్రులు గలరు. వారిలో దుర్యోధనుఁడు పెద్దవాఁడు. ధృతరాష్ట్రుని తమ్ముఁడైన పాండురా జఖండశౌర్య సంపన్నుఁడు. అతఁ డన్నగారికి కుడి భుజమై రాజ్యభారము వహించెను. అతని పెద్దభార్య కుంతీదేవి. రెండవభార్య మాద్రి. వారిరువురకును దేవతా వరప్రసాదమున ధర్మజ భీమార్జున నకుల సహదేవులు జన్మించిరి. వారే పంచపాండవులు. పాండురాజు మరణా నంతరము పెద్దతండ్రియగు నాంబికేయుఁడే పాండవులను చేరఁదీసి పెంచుచుండెను.

రాకుమారు లెల్లరును ద్రోణాచార్యుఁడను ధనురా చార్యునికడ విలువిద్య నభ్యసించుచుండిరి. సూర్యసుతుఁ డును తెలియకుండా నాచార్యుని కడ కరిగి ధనుర్విద్యా రహస్య ములు గ్రహించుచుండెను. కుంతీదేవి కర్ణుని వృత్తాంత మెఱిఁగి చిత్తప్రశాంతి నంది యుండెను.

## తృతీయ ప్రకరణము

అది మహారాజ సభామంటపము. మండపమధ్యమున మహోన్నతమైన భారతవీరపతాక భాసిల్లుచుండెను. చక్రవర్తి ధృతరాష్ట్రుఁడు స్వర్ణసింహాసనాసీనుఁడై యుండెను. ఒకప్రక్క భీష్మ విదురాది కురువృద్ధులును, ఒకవైపు కృపా

శ్వత్థామాది యాచార్యవర్యులును, ఒక చెంత మంత్రి సామంత భూకాంతులును బారులు దీర్చి యుచితాసనములపై నుపవిష్టులై యుండిరి. రంగస్థలమున కనతిదూరమున గాంధారి కుంతి మొదలగు నంతఃపురాంగనలు కూర్చుండి యుండిరి. రాకుమారుల యస్త్రవిద్యా నైపుణ్యము నవలోకించు నభిలాషతో నరుదెంచిన పురజనులతో మహాసభ కిటకిట లాడుచుండెను. విద్యాప్రదర్శనమునకై ప్రత్యేకముగా నేర్పాటుచేయఁబడిన రమణీయ రంగస్థలముపై రత్నభూషణాలంకృతులైన రాజకుమారులు విరాజిల్లుచుండిరి. కుమారరత్నముల నడుమ బ్రహ్మతేజః ప్రభావ ప్రభాసితమైన ప్రసన్న ఫాలభాగమును, దిగంత విశ్రాంత దీప్తిమంతములగు దృగంతములును కలిగి ధనుష్కళా ధురంధరుఁడగు ద్రోణాచార్యుఁ డలరారుచుండెను.

ఆచార్యుఁడు సభాసదు నాలోకించి "మహారాజా! పితామహా! ప్రేక్షకులారా! రాజపుత్రుల క్షాత్ర తేజము నినుమడింపఁ జేయుటకై నా యోపినంత పాటుపడితిని. నేఁడు దుర్యోధనాది సోదరశతంబును పాండవ పంచకంబును మత్సాన్నిధ్యమున నేర్చిన యస్త్రవిద్యాపాండిత్యము నిటఁ బ్రదర్శింపఁగలరు. సావధానముగా సందర్శింతురుగాక!" యనెను.

కుంభసంభవుని యనుమతిగొని కరవాలములు ధరించి కొందరును బాణతూణీరముల నూని మఱికొందరును రాకుమా

రులు తమతమ శస్త్రాస్త్రవిద్యాకౌశల్యమును ప్రదర్శించిరి.

అనంతరము భీమ దుర్యోధనుల వంతు వచ్చినది. వజ్రకవచములు ధరించి నడుములు బిగించి భుజాదండములపై గదాదండము లుంచి కండలు తిరిగిన యువయోద్ధ లిరువురును మత్తవేదండమ్ముల మాడ్కి- డీకొనిరి. అఖండ శౌర్య సంపన్నులైన యా రాకుమారుల గదాయుద్ధము ప్రేక్షకులకు కన్నులపండు వాయెను.

తరువాత ద్రోణాచార్యుని ప్రియశిష్యుఁడగు నర్జునుఁడు వేదిక మీఁదికి వచ్చెను. శరశరాసనములు ధరియించి ముందున కరుదెంచిన వీరకుమారుని గాంచి ప్రేక్షకబృందము విజయధ్వానములు సల్పినది. శౌర్యమునకు తోడు సహజ సౌందర్యమును కలిగి దేవేంద్రునివలె తేజరిల్లుచున్న విజయుని సభయెల్ల సాభిమానముగా నవలోకించినది. గురునిచే ననుజ్ఞాతుండై కుంతికొడుకు సర్వజన నేత్రోత్సవముగా తన యస్త్రవిద్యాచాతుర్యముఁ జూపుచుండెను.

ఒకపరి నాగ్నేయాస్త్రము ప్రయోగించును. మరు క్షణమున తన్నివారణమునకై వారుణాస్త్రమ్ము నేయును. ఒకమాటు నాగాస్త్రప్రయోగము సేయును. వెనువెంటనే గారుడాస్త్రమున నద్దాని ఖండించును. ఈరీతి పరాక్రమోపేతమగు నర్జునుని ధనుష్కళాచాతుర్యము గని సభ్యులెల్లరును చకితులైరి. ఆచార్యుఁడు తన గురుత్వము సఫలమైన దనియును, కురువృద్ధులు వీరకుమారుఁడు విశ్వవిఖ్యా

తుఁడు కాఁగలఁ డనియు సంతసించిరి. పార్థుఁ డాచార్యున కభివాదము సల్పి తదీయాశీర్వాదము లందెను. ప్రమోద భరితులై భీమసేనాదులు పార్థుని కౌఁగిలించుకొనిరి. కాని సహజమత్సరుండగు దుర్యోధనుఁడు మాత్రము తల వంచుకొని లోలోన తపించినాఁడు.

అంతలో కమనీయ కాంచన కవచకుండల మండిత దేహుండగు రాధేయుండు శస్త్రాస్త్ర సహితుండై మహా సభం బ్రవేశించెను. ప్రభాకర శోభాప్రభాసితుఁడగు నా వీరకుమారుని గని సభ్యులెల్లరును స్తబ్ధులై పోయిరి.

“పార్థా! ప్రపంచమునఁగల ప్రభుపుత్రులం దెల్ల నీ యంత పరాక్రమవంతుఁడు లేఁడని గర్వింపకుము. నీ విప్పుడు చూపిన ధనుర్విద్యావిశేషము లెల్ల నేనును చూపెదను.” అనుచు కర్ణుఁడు గురువృద్ధులకు నమస్కృతులు సల్పి మున్నర్జునుఁడు చూపిన యస్త్రవిద్యల నెల్ల యెల్లరును మిక్కిలి యక్కజంపడఁ బ్రదర్శించెను.

పాండవులు లజ్జాపరవశులైరి. దుర్యోధనాదులు దుర్నిరీక్ష్య తేజోరాశియగు మార్తాండపుత్రుని మంచి మాటలతో మర్యాద చేసిరి.

అంత సూర్యనందనుఁడు పురందర సూతిని గనుంగొని “ఓయీ! నిన్ను ద్వంద్వయుద్ధమున నోడింప దలంపు గల్గినది. రమ్మని భుజాస్ఫాలనము గావించెను.

కవ్వడి యుద్రిక్తుఁడై కర్ణుని ప్రతిఘటించెను. ఆ ఘోర

కేసరుల దారుణరణముం గని కుంతీదేవి విభ్రాంతి నందినది. వ్రేటుదిన్న బెబ్బులుల కైవడి నన్యోన్య జయాభిలాషులై కర్ణార్జునులు పోరు సల్పుచుండిరి. సభ్యులు కుతూహలాయత్త చిత్తులై యా వీరకుమారుల పరాక్రమప్రదర్శనమును వీక్షించుచుండిరి.

అంతలో ద్వంద్వయుద్ధ ధర్మజ్ఞుండగు కృపాచార్యుఁడు లేచి యుద్ధము వారించి దిననాథతనయునిం గని "కుమారా! ద్వంద్వయుద్ధము సేయుముందు ప్రతివీరుఁడును తన్నుఁదాను పరిచయము చేసికొనవలయును. పార్థుఁడు పాండుభూపాల కుమారుఁడు. చంద్రవంశ క్షత్రియుఁడు. ద్రోణాచార్య శిష్యుఁడు. నీ వెవరవో సవినరముగాఁ దెల్పి సమరము సేయవచ్చు"నని శాసించెను.

అంతలో దుర్యోధనుఁడు లేచి "ఆర్యా! ఇది రంగభూమి. ఇందు ప్రతాపవంతు లెవ్వరయినను తమ ప్రతిభా విశేషములు ప్రదర్శింపవచ్చును. ప్రజ్ఞ యవసరముగాని పరిచయముతో నేమి పని? యని సప్తాశ్వనందనుని సమర్థించెను.

"కుమారా! అట్లు కాదు. రాజులకు మాత్రమే యన్యోన్యము రణము సేయుట పాడి" యని కృపాచార్యుఁడు వాక్రుచ్చెను. నిజకులగోత్రముల నిండుసభలో బయలు పఱుపఁజాలక రాధేయుఁడు మిన్నకుండెను.

అప్పుడు సుయోధనుఁ డెల్లర నుద్దేశించి "మహాశయు

లారా! రాజ్యమేలువారు రాజులు. వారే రాకుమారులతో రణము సేయ నర్హులు అని ధర్మవిదుల మత మంటిరేని ఇప్పుడే నామిత్రుఁడైన యీ మహావీరుని నంగరాజ్యమున కభిషిక్తుం జేయుచున్నాను.'' అని జనకుని యానతిఁ గొని రత్నాసనముపై రాధేయు నాసీనుం జేసి సమస్త సభ్య సమక్షమున నంగదేశాధీశుం గావించెను.

సభయెల్ల సంభ్రమాశ్చర్యములతో సుయోధనుని తేఱిపాఱఁ జూచినది. అంతలో నాత్మనందనుం డంగరాజై నాఁడని విని యతిరథుఁడు నానందుఁడై చయ్యన సభాస్థలికి చనుదెంచెను.

సభామధ్యమున దేదీప్యమానముగఁ దేజరిల్లుచున్న కర్ణుని నతిరథుఁడు కరుణానురాగములతో కౌఁగిలించుకొనెను. అనన్య సామాన్య శౌర్య సముపేతుఁడైన యంగరాజతి రథసూనుఁడని యెఱింగి రాజకుమారులు విస్మితులైరి.

అంత భీమసేనుఁడు భీషణభాషణములతో ''సూత పుత్రా! దండముఁ గొని భండనపండితు లగు ప్రభువుల రథములు తోలక రాజ్యభార నిర్వహణ కార్యక్రమమునఁ గష్టపడఁ బోవుచున్నావా?'' యని పరిహసించెను.

దుర్యోధనుఁడు క్రోధావేశములతో ''వృకోదరా! రాధేయుఁ డంగరాజ్యమునకే గాదు, చతుస్సముద్ర పరివేష్టితంబైన జగతికెల్ల సార్వభౌమత్వము వహింపఁగల సమర్థుఁడు.''అని వాయుపుత్రుని మాటలకు సమాధానమిచ్చెను.

అంతలో సాయంకాల మయ్యెను. రాజకుమారుల పరస్పర దూషణవాక్యము లాలించి పర్యవసానము ప్రమాద భరిత మగునేమో యని శంకించి కురువృద్ధులు సభ ముగింపఁ దలంచిరి. ద్రోణుని యానతి పాండుకుమారులును ప్రభు నాదేశమున ప్రేక్షకులును నిజనివాసముల కరిగిరి.

రాధేయుఁడు సుయోధనుని యౌదార్యమున కతని నభినందించి "మహోదయా! సభామధ్యమున నా గౌరవమును కాపాడితివి. ప్రజ్ఞామతీ! నేను నీ కాజన్మాంతము కృతజ్ఞుఁడను. మన పవిత్రమైత్రి శరజ్జ్యోత్స్నవలె క్షణక్షణ వర్ధితమగుఁ గాక!" యని ప్రేమపూర్వకముగా వాకొనెను. దుర్యోధనుఁడు సహర్షుఁడై "మిత్రమణీ! పార్థునికిఁ బ్రతివీరుఁడవైన నీ యమేయపరాక్రమము నీ సుహృద్భావమునకు నీరాజన మెత్తుచున్నది. నీవు నా స్నేహితుఁడ వగుటయే నా జీవితైక వాంఛ. నా యభిప్రాయము నవగతము చేసికొని నన్ను నీ యాత్మమిత్రునిగా నంగీకరించుట నా మహాభాగ్యము. నీకు నా ధన్యవాదములు." అని కర్ణుని కరము తన కరమ్మునఁ బట్టి సాదరముగ వచించెను.

కర్ణ దుర్యోధను లిట్లు సౌహార్దమయ హృదయములతో స్వగృహమ్ముల కేగిరి.

## చతుర్థ ప్రకరణము

కుంతీదేవి యంతిపురమున నేకాంతముగాఁ గూర్చుండి యుండెను. ఆమె నేఁటి సభామధ్యమున తన యజ్ఞాత తనయునికి జరిగిన యవమానమును గుఱించి విచారించుచు క్రుంగిపోవుచుండెను.

సూర్యభగవానుని కృపాపరిపాకమున సుక్షత్రియాంగనకు జన్మించిన శూరశేఖరుఁడు సూతవంశప్రసూతుఁడని పరిహాసింపఁబడుచుండ మాతృదేవి చూచి యూరకుండఁ గలదా! తాను చేతిమీఁదుగా చేసిన ఘాతుకత్వమునకు ఫలితము తన సుతుఁ డనుభవించుటా! యని యామె శోకించినది. ఏకగర్భ సంజాతులైన తన తనయు లెఱుఁగక యన్యోన్యదూషణాలాపము లొనరించుకొని ఘోరముగా రణమొనరించి సోదరప్రేమకు దూరమై పోవుట తలంచి కడుంగడు దుఃఖించినది. బాల్యమున తానొనర్చిన మహాపరాధము బయటపెట్టి కర్ణుని నిష్కళంక చరిత్రము లోకమున కెఱింగించుట తనకర్తవ్యము కాదా యని యనుకొనినది. అట్లు జరిగిన తన కెంత పరాభవము జరుగునో! ధర్మజాదు లెంత యపకీర్తి నందుదురో! సంఘమున తన స్థాన మెట్లు లధఃపతితమై పోవునో యామె యూహించినది. తనవలన భారతరాజవంశమున కెంత పరిభవము జరుగునో విచారించుకొనినది.

ఆమె కేమి చేయవలెనో తోఁచలేదు. అట్లులే చాల

నేపు చింతించి యప్పటి కెట్టులో గుండె బిగఁబట్టుకొని దుఃఖము దిగమ్రింగుకొనినది.

కర్ణ దుర్యోధనుల మైత్రి క్రమక్రమముగా పెంపు గాంచినది. బలశాలులగు భీమార్జునులను గాంచి భీతిచెందు సుయోధనుఁడు శూరాగ్రేసరుఁడగు సూర్యసుతుని యండ చూచుకొని నిర్భయుఁడై యుండెను. అవక్ర పరాక్రముఁడగు నంగధరేశ్వరుని సంపూర్ణసహకారము తన కందుపాటులో నుండుటంజేసి యర్ధరాజ్య మర్థించు ధర్మజాదులకు సంగరరంగమున శృంగభంగముఁ గావించి తన సార్వభౌమత్వము సుస్థిరముఁ జేసిగొనఁగలనని దుర్యోధనుఁడు గ్రుక్కిళ్ళు మ్రింగుచుండెను.

రాధేయుం డొకదినమున జననీజనకుల యనుమతి వడసి ద్రోణాచార్యుని సన్నిధి కరిగి యతనికి భక్తిపూర్వకముగా ప్రదక్షిణప్రణామము లాచరించి "దయామయా! తమ శిష్యత్వ మర్థించి మహోత్సాహముతో తమదగ్గఱకు వచ్చితిని. నాకు బ్రహ్మాస్త్ర ముపదేశింపుఁడు." అని సవినయముగాఁ బ్రార్థించెను.

ఆచార్యుండు విభ్రమాశ్చర్యంబులతో నా వీరకుమారుని వీక్షించి "సూతపుత్రా! బ్రాహ్మణ క్షత్రియులకుఁ దప్ప బ్రహ్మాస్త్రము పరుల కుపదేశింపరాదు. సంఘమునకును శాస్త్రమునకును విరుద్ధముగా సంచరింపఁ జాలను." అని సానుభూతివచనము లాడి సాగనంపెను.

అస్త్రవిద్య నర్థించివచ్చిన యంగరాజు తిరస్కృతుఁడై మనోవేదనఁ బొంది "సూతపుత్త్రుఁడను సాకుచేత నన్ను ధనురాచార్యుఁడును దయఁ జూడలేదుగదా! కానిమ్ము. కరుణాళువైన గురుదేవుఁడు లభించుదాఁక స్వయముగా నస్త్రవిద్యా నైపుణ్యము పెంపొందించుకొందును గాక!" యని తలంచి నిర్ణీతస్థలమున బాణప్రయోగ నిపుణతకై పాటుపడఁ దొడంగెను.

కొన్ని దినములు గడచినవి. ఒకనాఁడు కర్ణుఁడు లాఘవాభ్యాసమ్ము గావింపుచుండెను. దైవనిర్ణీతమున సరిగా నదే సమయమున నొక యవనీసురుని యావుదూడ యా ప్రాంతమునకుఁ బరువిడి వచ్చెను. పాపము! ప్రమాదవశమున నతనిచేఁ బ్రయోగింపఁ బడిన నిశితబాణ మా ధేను వత్సమునకు చిఱుడొక్కలోఁ గ్రుచ్చుకొనెను. అది వెను వెంటనే గిలగిల తన్నుకొని నేలఁబడి యసువులు వాసెను.

ఆ యావుదూడకు కొండొక దూరమున నరుదెంచు చున్న ధారుణీసురుఁ డా దారుణ కృత్యమును గాంచి దండతాడిత భుజంగమువలె మండిపడుచు ధనుర్ధరుఁడైన కర్ణునిం గని "కలుషాత్మా! కండకావరమున నకారణముగా గ్రోవం బోవుచున్న యావుదూడపై నీ యస్త్రవిద్యాపాండిత్యము చూపితివి. నీవంటి నీచునకు క్షమాపణమే లేదు. ఈ గోహత్యాపాపఫలితముగా రణభూమిలో నీ రథచక్రములు కుండలవలకు క్రుంగిపోవుఁగాక!" యని యతిభయంకరముగా

శపించెను.

కర్ణుఁడు విధివైపరీత్యమునకు వెఱఁగంది "పొరపాటు జరిగినది. కరుణింపుఁ"డని భూసురుని పరిపరివిధముల బ్రతిమాలియు విఫలుఁడై విచారించుచు నింటికేగెను.

తనపై కొండంత యాశ పెట్టుకొనిన కురురాజునకు ప్రీతి గూర్పవలయునని యంగరా జెంచినాఁడు. అస్త్రవిద్యానిపుణుఁడగు నర్జును నతిశయించుటకై యుత్తమాస్త్ర సంపాదన మత్యవసరమని భావించినాఁడు. కాని తన భావి జీవితమునకు గమ్యస్థాన మేమిటో యూహించుకొనలేక పోయినాఁడు. రారాజు కర్తవ్యము బోధింపఁగలఁడని నిర్ణయించుకొనినాఁడు.

ఒకనాఁటి యుదయమున సూర్యోపాసన పూర్తి గావించుకొని రాధేయుఁడు సుయోధనుని మందిరమున కరిగెను.

మేడపైనుండి కర్ణు నల్లంతదూరముననే కనుఁగొని రారాజు మహానందముతో నెదురువచ్చి స్వాగత మిచ్చినాఁడు. సౌధాంతర్భాగమున మిత్రు లిరువురు ముచ్చటలాడుకొనసాగిరి.

రాధేయుని రాకకు కారణ మెఱిఁగి రారాజు కొంతవడి యోచించి "మిత్రమణీ! మహామహుండగు భార్గవ రాముండు మహేంద్రమహీధరముపై మౌనివృత్తి నున్నవాఁడు. నీ వా దయాళుయు నాశ్రయించుట శ్రేయోదాయ

కము. కాని, యాతఁడు బ్రాహ్మణేతరులకు ప్రసన్నుఁడు కాఁబోఁడు. కావున నీవు కపట భూసురపుత్ర వేషమున నా పుణ్యమూర్తికి శిష్యుఁడవు గమ్ము. మన కోరిక లీతీరున నీడేరఁగలవు.'' అని తన యభిప్రాయ మెఱింగించెను.

కపటాభినయమునకుఁ గర్ణుని యంతరంగ మంగీకరింప లేదు. కాని మిత్రప్రేరణము ననుసరించి యతఁడు పరశురాముని కడ కరుగఁ గృతనిశ్చయుఁ డయ్యెను.

## పంచమ ప్రకరణము

అది పర్ణశాల. ప్రశాంతత యెల్లయెడల వెల్లివిరియుచుండెను. బ్రహ్మతేజః ప్రభావసంపన్నుండగు పరశురాముండు ధ్యాననిమగ్నుఁడై యుండెను. భానుతనయుఁడు భక్తియుక్తుండై భార్గవరామునికి సాష్టాంగ దండ ప్రణామము నాచరించి యొక ప్రక్క కొదిగి నిలువఁబడి యుండెను.

పరశురాముఁడు కనులు తెఱచి కర్ణుని గని ''కుమారా! నీ వెవ్వరవు? మ మ్మే యుపకార మర్థింప వచ్చితివి?'' అని ప్రశ్నించెను. కర్ణుఁడు ''స్వామీ! నేను భృగువంశజుఁడను. తమదగ్గఱ శస్త్రాస్త్రవిద్యాప్రావీణ్యము సంపాదింప వచ్చితిని. కరుణింపుఁ'' డని ప్రార్థించెను. భార్గవరాముఁడు వాత్సల్యమయ హృదయుఁడై కర్ణుని శిష్యత్వ మంగీకరించెను. రాధేయుఁడును విధేయత గలిగి గురుదేవుని మన్ననలందుచుండెను.

ఇట్లు కొంత కాలము గడచినది. వివిధాస్త్రప్రయోగోప సంహారాది విద్యలలో కర్ణుఁడు తీర్ణుఁ డైనాఁడు. గురు దేవుఁడు ప్రియశిష్యుని కొకానొక శుభముహూర్తమున బ్రహ్మాస్త్రమహామంత్ర ముపదేశించినాఁడు.

నాఁడు పిండారఁబోసినట్లు పండు వెన్నెల ప్రపంచ మెల్ల నిండియుండెను. గురుశిష్యు లిరువురును పటుకుటీరము ముందర చల్లగాలికి ముచ్చటలాడుచుఁ గూర్చుండి యుండిరి.

"కుమారా! నేటితో నీ విద్యాభ్యాసము పూర్తి యగునుగదా! నేఁడు నీ కొక సందేశము నీయ నెంచితిమి. ఏమందువా! ధనాధికార మదాంధులగు భూధవుల దౌష్ట్య ములకుఁ దాళఁజాలక పరితపించు నమాయిక ప్రజానీకమును రక్షించుటకై యిరువదియొక్క మాఱులు దారుణముగా మారణకర్మ మాచరించితిమి. ఐనను జగతిలో శాశ్వతమైన దానవ మానవ మహాసమరము గాంచఁజాలక నీ మహేంద్ర శైలమున వానివృత్తి వహింప వచ్చినారము.

నాయనా! ధర్మముపై నధర్మము దండెత్తినను దురధి కార పిశాచి నరపాలుర తలలెక్కి వైతక్కలాడినను నిరంకు శత్వము ప్రజానీకముపై అంకెలువేసినను చూచి వీరులు నీళ్లునమలుచు మిన్నకుండరాదు. ప్రతిక్రియ నాచరించుటే పరమకర్తవ్యము. సత్యముతో సాహసముతో జగతిని జయింపవచ్చును. మఱచిపోకుము. ఈ సందేశము నీ కం దించుటే నా చిరాభిలాష. అందులకే ధర్మోద్ధరణార్థమే

నిన్ను పరిపూర్ణ ధనుర్విద్యాపారగుని జేసితిని.” అనుచు చల్లని పిల్లగాలికి కన్నులు కూరుకొనిపోఁగా కర్ణునితొడ తలగడగాఁ జేసికొని పరశురాముఁడు సుఖనిద్రాపరవశుఁడయ్యెను.

రాధేయుండు గురుదేవుని కపారభక్తితో నిజోత్తరీయాంచలమున విసరుచుండెను. అంతలో నొక దుష్టకీటక మెక్కడనుండియో వచ్చి కర్ణునితొడఁ గొలుకఁదొడంగెను. ఊరుభాగమునుండి రుధిర మేఱులు గట్టుచున్నను, కాలు గదల్చిన గురువర్యునకు నిద్రాభంగ మగునేమోయని రాధేయుఁడు బాధ నోర్చుకొనుచు మిన్నక యట్లే కూర్చుండియుండెను.

రక్తప్రవాహ మంతకంతకు నెక్కువగుటచే పరశురాముని శరీరమునకు తడి తగిలెను. వెంటనే యతం డదరిపడి లేచి రక్తప్రవాహమును గాంచి దిగ్భ్రాంతుఁడై “కుమారా! ఈ రుధిర మెక్కడిది?” అని యాతురతతోఁ బ్రశ్నించెను.

కర్ణుని కాలుచేతులు కంపమందుచుండెను. కన్నులు విహ్వలము లయ్యెను. కంఠము గాద్గద్యమందెను.

“స్వామీ! ఇది...

“ఈ రక్త మెక్కడినుండి వచ్చినది?”

“గురుదేవా! మీరు నిదురించిన తరువాత నొక కుటిల కీటక మెక్కడనుండియో వచ్చి నాతొడ తొలువ

నారంభించినది. తొడ గదల్చిన మీకు ప్రశాంతి భగ్న మగునేమో యని యట్లే కూర్చుండి యుంటిని."

పరశురాముడు మౌనము వహించెను. అతని మాన సాకాశమున నెన్నియో భావములు తళుక్కున మెఱసినవి. తన శిష్యుడు నిజముగా "ధరణీసురుడేనా? బ్రాహ్మణుడైన నింత బాధ నోర్చుకొనగలుగునా?" యని యతనికి సంశయము కలిగెను.

"ఓయీ! నీ వెవ్వడవు? నిజము చెప్పుము!" అని తీక్ష్ణస్వరముతో బ్రశ్నించెను.

కర్ణుడు కంపితకంఠముతో "స్వామీ! నేను తమ శిష్యుడను." అని ప్రత్యుత్తర మిచ్చెను.

పరశురాముడు మఱింత యావేశముతో "నిక్క ముగా నీవు బ్రాహ్మణుడవేనా? కావు. అసత్య మాడితివా నిన్ను భస్మీభూతుని గావింతును." అని కఠినముగా నొవ్వ నాడెను.

కర్ణుని దేహమున చెమట పోసెను. కన్నులు చీకట్లు గ్రమ్మెను. గొంతుక తడి యారెను. అతడు చేతులు జోడించి "స్వామీ! నన్ను క్షమింపుడు. నేను సూత పుత్రుడను. అరాతుల బరాభూతుల గావింపనెంచి మహాస్త్రములు సమార్జించుటకై తమ సాన్నిధ్యమున కరుదెంచి యసత్యమాడితిని" అని సత్యమును విన్నవించు కొని మిన్నకుండెను.

పరశురాముఁడు ప్రళయకాల భైరవుఁ డయ్యెను. "గురుద్రోహీ! కలుషహృదయుఁడవై కపటవేషమున నన్ను వంచించి నాకడ నభ్యసించిన మహాస్త్ర మంత్రము లెల్ల సమరమధ్యమున నవసరమగు సమయమున మఱచి పోయెదవుగాక! మదుపదిష్టమైన బ్రహ్మాస్త్రము నీయెడ నిరుపయోగ మగుఁగాక! పొమ్ము. ఇంక నా దృష్టిపథము నుండి తొలఁగి పొమ్ము." అని భయంకరముగ శపించెను.

అంగధరాకాంతుఁడు తన దురదృష్టమున కెంతయో చింతించి భరింపరాని నిరాశతో స్వపురోన్ముఖుఁ డయ్యెను.

## షష్ఠ ప్రకరణము

కౌరవ పాండవులకు వైరము పెరిగినది. నిఖిల దేశాధీశ్వరులను నిర్జించి భారతసామ్రాజ్యమును సుప్రతిష్ఠితముఁ జేసిన పాండురాజునకు రాజ్యమం దర్ధభాగము కలదనియు నద్దానిని తమ యధీనముఁ జేయవలె ననియు పాండవులు కోరుచుండిరి.

రాజ్యాధికారము జ్యేష్ఠవంశములోనిదే గాని కనిష్ఠ వంశములోనిది కాదనియు అంధుఁడగు నగ్రజుని పేరిట కొన్నినాళ్లు రాజ్యభారము వహించినంత మాత్రమున పాండురాజునకు రాజ్యార్హత కలుగదనియు, నేకచ్ఛత్రాధిపత్యముగా నేలవలసిన భారత సామ్రాజ్యమును విభజించుట యవివేకమనియు సుయోధనుని వాదము.

కాని లోకోత్తర పరాక్రమ యుతులగు భీమార్జును లను వారి గదాగాండీవములను తలంచుకొని రారాజు కడుం గడు భయంపడుచుండును. అందువలననే దినకర నందనునిపై యతఁడంత మక్కువఁజూపి మహీపతిని జేసి తన జీవిత సర్వస్వముగా నమ్ముకొని యున్నాఁడు.

చిన్నతనము నుండియు భీమాదుల కెగ్గుసేయుటయే దుర్యోధనుని నిత్యకృత్యము. కాని దైవానుగ్రహమున పాండవుల కేమియు హాని కలుగలేదు. రారాజు కొండొక మిషతో పంచపాండవులను వారణావతమున కంపించెను. వారచ్చట తనచే ప్రత్యేకముగా తయారు చేయించఁబడిన లక్కయింట నివసించుచున్నప్పుడు దానికి నిప్పు పెట్టించెను. కాని పాండవు లంతకుముందే యా లాక్షాగృహమునుండి బయటఁబడి బ్రాహ్మణ వేషములతో నేకచక్రపురము చేరుకొనిరి.

ఆరోజులలోనే పాంచాలపతి ద్రుపదుఁడు తన కుమార్తెకు స్వయంవరము చాటఁబంపెను.

ద్రౌపదీస్వయంవరసభ చక్కఁగా నలంకరింపఁబడినది. అందు సమాహూతులై వచ్చిన వివిధ దేశ విభులును వినూత్న భూషణాలంకృతులై విరాజిల్లుచుండిరి. కర్ణదుర్యోధనులును మత్స్యమద్ర మహీనాథులును పాండవ పంచకంబును శ్రీకృష్ణ బలరామాదులును సభ నలంకరించిరి.

సోదరి ద్రౌపదిని వెంటఁబెట్టుకొని ధృష్టద్యుమ్నుఁడు

సభామంటపములోనికి వచ్చెను.

మహాసభామధ్యమున మత్స్యయంత్ర మమర్పఁబడి యుండెను. దానికి దగ్గఱగా పెద్ద ధను స్సొకటి యుంచఁ బడెను. దృష్టద్యుమ్నుఁడు వానిని నిర్దేశించుచు నానారాజ నందనుల నుద్దేశించి "వీరులారా! ఈ మత్స్యయంత్రము నీ మహాధనుస్సుతో నే శూరశిరోమణి ఛేదించునో యతఁడు నా సోదరికిఁ బతి కాఁగలఁడు. సమర్థులగు రాజనందనులు సయత్ను లగుదురుగాక" యని పల్కి తన పీఠమునఁ గూర్చుండెను.

అవనీపతు లొక్కరొక్క రాయంత్రమును సమీపింప సాగిరి. ఒకనికి విల్లే లేవలేదు. మరియొకని కా వింటి నెక్కువెట్టుటే చేతకాలేదు. వేఱొకని కా యంత్రమును గనుసరికి గాలుసేతులు చల్లపడెను. భ్రమపడి, భంగపడి, సిగ్గుపడి పలువురు నరపాలురు వెనుకకు మరలిరి. ద్రుప దుఁడు విభ్రాంతుఁ డయ్యెను. తన కుమార్తె స్వయంవరము నగుఁబాట్లు పాలగునేమో యనిపించెను.

అంతలో దృష్టద్యుమ్నుఁడు లేచి, "రాకుమారులారా! మీలో నొక్కరుఁడైన వీరుఁడు లేఁడా! మీ యుపేక్షా భావము భారతరాజవంశముల కవమానకరము గాదా!" అని యధిక్షేపించెను.

అంతలో "తొందరపడకు రాజపుత్రా!" అను గంభీర భాషణములు వినవచ్చెను. రాజులెల్ల రా శబ్దము వచ్చిన

నైపుణకు తలలెత్తి చూచిరి.

మందహాసము సేయుచు మణిహార సమంచిత మంగళ దేహుండును శౌర్యసమన్విత సుందర బాహుండును నైన సూర్యనందనుండు సింహకిశోరము వలె ముందునకు వచ్చెను. మహోజ్జ్వల మకుటకాంతులతో సభాభాగము క్రొత్త యందము తీనుచుండ మత్స్యయంత్రమును తేఱిపాఱఁజూచి ధనుస్సు నెక్కు పెట్టి యతఁ డద్దాని నేయఁబోవునంతలో "సూతవంశోద్భవుని నేను వరింపను" అని పాంచాలి పరిహాస ప్రాయముగాఁ బలికెను.

ఆ మాటలు విని కర్ణుఁడు ప్రాణ్పడి నిలిచిపోయెను. చేతినుండి విల్లు జారిపడినది. అతఁడు నిరుత్సాహుఁడై మరలి పోయెను.

అనంతరము బ్రాహ్మణవేషమున నున్న పార్థుఁడు మత్స్యయంత్రమును భేదించి పాంచాలిని పరిణయమాడెను.

పాపము! రాధేయుని దురదృష్టమే మోకాని యెక్కడకు పోయినను చుక్కెదురగుచున్నది. దైవప్రాతికూల్యమునకు తల వంచక తప్పదుగదా! మహాసభలో నవమానము జరిగినది. ద్రోణాచార్యుఁడు శిష్యత్వమీయ నిరాకరించినాఁడు. బుద్ధిపూర్వకముగాఁ జేయని యపరాధమునకు ప్రబుద్ధుఁడగు బ్రాహ్మణుఁడు కోపావేశుఁడై శాపమిచ్చినాఁడు. సమస్తరాజలోక సమక్షమున "సూతసుతుఁ" డని పాంచాలి పరిహసించినది. కేవలము లోకమున సూత

పుత్రుఁడని పిలువఁబడు మాత్రముననే గదా యీ పరాభవములు - పరాఙ్ముఖత్వములు - భయంకర శాపములు ప్రాప్తించినవి.

కర్ణుఁడు తనకు సంభవించిన కష్టములఁ దలంచుకొని కలవర మందలేదు. అతని మనోబలమును సహనశక్తియు నసమానములు; అచంచలములు.

## సప్తమ ప్రకరణము

రాధేయుఁడు వీరాధివీరుఁడే కాదు; విశ్వవిఖ్యాతుఁడగు మహాదాతకూడ. అతఁడు తనచేత దానకంకణము కట్టుకొని యర్థిజనుల కడిగినదెల్ల లేదనక యిచ్చుచుండెడివాఁడు. అనన్య బాహుబలమునకుఁ దోడు వదాన్యతయును నాతని యశోవైభవమునకు కర్పూర నీరాజన మెత్తినది.

రారాజగు సుయోధనుఁడు తన సామంత ప్రభువే యంత ఘనుఁడు కాఁగా తాను మాత్ర మేల దానవీరుఁడు కారాదని తలంచి స్వహస్తమున దానదీక్షా కంకణము ధరించెను.

ఒకనాఁ డొక బ్రాహ్మణుఁడు కర్ణుని దగ్గఱకు వచ్చి "రాజా! నే నొక యజ్ఞముసేయఁ దలంచితిని. అమ్మహాధ్వరమునకు వలయు వంటకట్టియల నిచ్చుటకు దాననిరతులగు తమవంటి ధరాపాలురకుఁ దప్ప పరులకు సాధ్యముకాదు. అందులకే యనల్పయాచక కల్పభూజములగు తమ్మర్థించితిని"

అని పల్కెను.

కర్ణుఁడు సంతోషముతో "స్వామీ! తమకు కావలసిన వంటచెఱకు నిప్పుడే బండ్లకెత్తించి పంపెదను." అనెను. "రాజా! జన్న మారంభించు సమయమున స్వయముగా వచ్చి పట్టించుకొని వెళ్ళెదను. అంతవఱకును దానిని తమ యధీనముననే యుంచుఁడు." అని పలికి యట సెలవు దీసికొని రారాజుకడ కేగి యతనిని గూడ నట్లే కోరి "సరే" యనిపించుకొని విప్రుఁడు వెడలిపోయెను.

అది వర్షాకాలము. వానలు విపరీతముగాఁ గురియు చుండెను. గ్రామములందెల్ల వెల్లువలు చెలరేగెను. ఎండిన పుల్లలు దొరకక ప్రజ లన్నము వండుకొనుటకుఁ గూడ పలు బాధలు పడుచుండిరి.

ఆనాఁ డురుములతో మెఱపులతో బ్రహ్మాండముగా వర్షము కురియుచుండెను. అట్టియెడ నా బ్రాహ్మణుఁడు హస్తిపురిఁ జేరి రారాజును దర్శించి "నాఁ డిత్తుమన్న వంట చెఱకు నిప్పింపుఁ" డని యడిగెను.

దుర్యోధనునకు క్రోధము పొంగివచ్చినది. "బడుగు బాపఁడా! ఇట్టి కాలముగాని కాలమున నీకు కావలసినంత వంటచెఱ కెక్కడనుండి వచ్చును? కొన్నిదినములు గడచిన తర్వాత రమ్ము. పో" మ్మని గద్దించి వెడలఁగొట్టెను. చేయునది లేక భూసురుఁడు కర్ణునిఁ జేరి వాగ్దానము చెల్లించుఁ డని వేడుకొనెను. కర్ణుఁ డొక్కింత తడవు యోచించి తన

యున్నత సౌధములను తదేకదృష్టితో వీక్షించి తత్క్షణమే బాణములను భవనముల కాధారమగునట్లు ప్రయోగించి, వాని కలపనెల్లఁ దీయించి బండ్ల కెత్తించెను. జోరున ధారాపాతముగా వాన కురియుచుండుటచే వంటచెఱకు తడువకుండ మైనపుపట్టాలు కప్పించి బ్రాహ్మణుని కప్పగించి సగౌరవముగా పంపివేసెను.

అది విని రారాజు లజ్జితుఁడై కర్ణుఁ డొక్కఁడే దీక్షాధారణకు యోగ్యుఁడని భావించి తనచేతి కంకణము నూడఁ దీసివైచెను. సర్వసర్వంసహాభర్తలు సలుపఁజాలని ఘనకార్యము సామంతుఁడు చేసెనన్న నతని సాహసత్యాగములు శ్లాఘనీయములు గదా!

## అష్టమ ప్రకరణము

మాయావి యగు సుయోధనుని చే తయారుచేయింపఁబడిన లక్కయింట పాండవు లుక్కడగలేదని పాంచాలీ పరిణయానంతరము ధృతరాష్ట్రునకు విశదమైనది. బలశాలులగు పాండవులు తన కొమరుల భరతము పట్టఁగలరని గ్రుడ్డిరాజు భయపడినాఁడు. లేని యనురాగమును కొనితెచ్చుకొని ధర్మజుని పిలిపించి యర్ధరాజ్యమున కభిషిక్తుం జేసినాఁడు.

పాండవులు భూపతుల నెల్లర పరాజితులఁ గావించి యతివైభవముగా రాజసూయము చేసి యద్వితీయమగు యశస్సు నార్జించిరి. పాండవుల జైత్రయాత్రఁ దలంచుకొని

కురురాజు తనలో తాను కుమిలిపోవుచుండెను.

అప్పుడు కర్ణుడు సుయోధను ననునయించి "మహారాజా! పాండవపంచకంబు కావించిన దిగ్విజయయాత్ర నే నొక్కండ నాచరించి విశ్వవిజయ వీరపతాక హస్తినాపురనాథుని ప్రాసాదాగ్రమునఁ బ్రతిష్ఠింతును." అని పలికి తల్లిదండ్రుల శుభాశిషములంది చతురంగబల సమేతుండై జైత్రయాత్ర కరిగెను.

ప్రథమమున పాండవుల మామయగు పాంచాలపతిపై దాడిచేసెను. పరాక్రమశాలియగు పాంచాలదేశాధీశ్వరుఁడు సర్వసేనాధిపత్యము స్వయముగా వహియించి రాధేయు నెదుర్కొనెను. నిరుపమాన శస్త్రాస్త్ర విద్యానిపుణుండగు కర్ణుండు విజృంభించి వీరవిహారము గావించెను. సూర్యసుతుని శౌర్యానిలమునకు ద్రుపదుని ప్రతాపము తృణప్రాయ మయ్యెను. ప్రాణభయమున సైనికు లెల్లరును పారిపోయిరి. పాంచాలవసుమతీపతి 'దాసోఽహ'మ్మని రత్నరాసులు రాధేయునికి బహూకరించి పంపివేసెను.

అనంతరము భాస్కరనందనుఁడు ప్రాగ్జ్యోతిషపురముపై దండెత్తి తత్పాలకుండగు భగదత్తుని పరాజితుని గావించి పదివేల సువర్ణఖండములు బహుమానముగా గ్రహించెను.

పిదప నుత్తరదిశకుం జని హిమాలయ మహాశైల ప్రాంతమందలి మహాబలవంతులగు వివిధ దేశాధినాథుల విజితులం గావించి, పూర్వదిగ్విజయమునకు బయలు దేఱెను.

వంగ కళింగ మగధ దేశాధినేతలు భండనమున చండాంశునందను నెదురలేక లోఁబడి ప్రణతులు గావించిరి. చేది విదర్భ దేశాధీశ్వరులు సంధిఁ జేసికొనిరి. ఆ యా వసుంధరాపతులు సమర్పించిన కానుకలఁ గైకొని కర్ణుఁడు దక్షిణదిశకు మరలెను.

పాండ్యరాజు పాదాక్రాంతుఁ డయ్యెను. చోళభూపతి వశుం డయ్యెను. కేరళాధిపతి కాళ్ళబేరమునకు వచ్చెను. మద్రరాజు నమస్కరించెను. అవంతీశ్వరుఁడు సామంతుఁ డయ్యెను. సింహళపాలకుఁడు కప్పములు గట్టి పెక్కులు గజసైంధవములు సమర్పించెను.

పిమ్మట మార్తాండపుత్రుండు పశ్చిమదిక్కును జయింప నిశ్చయించుకొనెను. మాళవపతిని మహాహవమున నిర్వ్యరించి యోడించి యతఁడు బహూకృతిగా నొసంగిన మణి సువర్ణములు గ్రహించెను. అనంతరము యవనదేశముపైఁ బడి యా భూధవుని గెలిచి యతఁ డిచ్చిన ధనకనకరాసులు గైకొని సంతుష్టుండై హస్తిపురికి మరలిపోయెను.

ప్రియమిత్రుఁడు విజయశ్రీ విరాజితుఁడై విచ్చేయుచున్నాఁడని యెఱింగి రారాజు సపరివారముగా నెదురు వచ్చి ఘనస్వాగతమిచ్చి యతనిని పురములోనికి తోడి తెచ్చినాఁడు. సకలరాజలోకమును సామంతము గావించుకొనివచ్చి భారతసామ్రాజ్యలక్ష్మికి సంతసము గూర్చిన మహారథి కర్ణునిపై ప్రాసాదాగ్రములనుండి పుష్పవర్షము

కురిసినది. సంపాదించిన ధనమునెల్ల వెచ్చించి రారాజు పాండవుల రాజసూయమును మించు వైష్ణవయాగ మతి వైభవముగా నాచరించి దిగంత విశ్రాంత కీర్తిమంతుఁ డైనాఁడు.

కర్ణుని జైత్రయాత్ర కౌరవులకు కనులపంట. పాండవులకు కడుపుమంట. కర్ణుని యండఁజూచుకొని దుర్యోధనుఁ డింకను చెలరేగెను. ఇంద్రప్రస్థము నేలుచున్న పాండవులను సుహృద్ద్యూతము నెపంబున రావించి మాయాద్యూతమున వారి రాజ్యము నపహరించినాఁడు. పాండవులు వనవాసాజ్ఞాత వాసములు పదుమూఁడేండ్లు చేయవలసి వచ్చినది. నియమము నకుఁ గట్టువడి ధర్మజాదు లరణ్యముల కేగిరి. వనవాసాజ్ఞాత వాసానంతరము వారు కౌరవుల పీచ మడంపనెంచిరి. కాని సహజ కవచకుండలాలంకృతుండును భానుతేజశ్శాలియును నజేయుఁడు నైన రాధేయుఁడు తమ ప్రతిపక్షమున నుండుటం జేసి వారును భయపడుచునే యుండిరి. ఐనను వారికి దైవానుగ్రహ బలము మిక్కుటము.

త్రిలోకాధిపతియగు దేవేంద్రుఁడు నిజాంశమున జన్మించిన పార్థునిపై పక్షపాతము గలవాఁడగుటచే నాతని కెట్టైన సాయము సేయవలెనని సంకల్పించుకొనెను.

## నవమ ప్రకరణము

అది రాధేయుని శయనమందిరము. పట్టుపాన్పుపై ప్రభాకరనందనుఁడు పరుండి యుండెను. అతఁ డేమియో రాజకార్యములఁ గూర్చి యాలోచించుకొనుచు కన్ను గూర్కెను.

*　　*　　*　　*

"కుమారా!"

"ఎవరు? స్వామీ! మీరా! నా యిష్టదేవులగు సూర్యభగవానులా! నమస్కారము. ఆ యాసన మలంకరింపుఁడు. కర్మసాక్షీ! తమ రాకకుఁ గతంబేమి?"

"కర్ణా! నీకు ప్రాప్తించనున్న యాపద దలంచుకొని నీపైఁ గల యభిమానముతో నీకు కర్తవ్యము బోధింప వచ్చితిమి."

"స్వామీ! కరుణానిధులగు తమరు కంటికి ఱెప్పవోలె నన్ను కాపాడుచుండ నాకుఁ గలుగఁబోవు కష్టమేమి?"

"కుమారా! రేపటిదినమున నాఖండలుండు కపట భూసుర వేషమున నీ కవచకుండలము లర్థింపవచ్చును. తన దయవలన జన్మించిన ఫల్గుణున కపాయము గల్గకుండ నతఁ డీ యుపాయము పన్నినాఁడు. వినుచుంటివా!"

"ధన్యోఽస్మి! మహానుభావా! త్రిలోకాధినాథుం డగు దేవేంద్రుండు దివిజలోకమునుండి దిగివచ్చి యీ కర్ణుని ముందు "భిక్షాం దేహి" యని నిలువఁబడునా?"

"కర్ణా! అది సంతసింపఁదగిన సంగతి కాదు. కేవలము దురాశాపూరితమగు ద్రోహబుద్ధి! అర్జునుఁడు సులభముగా నిన్ను జయించుట కమరేశ్వరుఁ డీ కార్యము సేయుచున్నాఁడు. కర్ణా! కవచకుండలములు నీ దేహమున నున్నంత వఱకును ఫాలాక్షుఁడైన నిన్ను పరాజితుని గావింపఁజాలఁడు. అట్టి యనంతశక్తిమంతములగు వాని నెఱిఁగియు వైరుల చేతఁ బెట్టకుము."

"స్వామీ! ఈ రీతిగా నన్నొకింత బలహీనుని గావించుట పార్థుని పరాజయమునకు ప్రత్యక్ష నిదర్శనము కాదా! జగద్బాంధవా! దానవీరుఁడని పేరుగాంచిన కర్ణుఁడు వ్రతభంగ మాచరింపఁజాలఁడు."

"కుమారా! తన్నుమాలిన ధర్మమా! నిన్ను నీవు కాపాడుకొనవలదా?"

"జ్యోతిర్మయస్వరూపా! క్షణభంగురమైన యీ శరీరముకొఱకు శాశ్వతమైన యశఃకాయమును గాయపఱచుకొనఁజాలను. నాపై కృపఁబూని హితవు గఱపిన తమకు నా ధన్యవాదములు. నన్ను మన్నింపుఁడు. బలవంతము సేయకుఁడు."

"కుమారా! నీ దృఢనిశ్చయ మనుపమానము. నీ త్యాగబుద్ధి వినిర్మలము. మే మింకఁ బోయివచ్చెదము."

* * * *

కర్ణుఁడు హఠాత్తుగా కనులు తెఱచిచూచెను. అచ్చట

నెవ్వరును లేరు. భయవిస్మయసంభ్రమములు ముప్పిరిగొన "ఆహా! నా సౌభాగ్య మపూర్వము. సూర్యభగవానునకు నాపై నెంత యనురాగము! ఆ విషయ మెఱింగింప పనిగట్టు కొని వచ్చినాఁడు. ఆ మహామహుని సందర్శింపఁ గలిగిన నేను ధన్యుఁడను." అని రాధేయుఁడు సంతుష్టాంతరంగుఁ డయ్యెను.

మఱునాఁటి యుదయమున రాధేయుఁడు లతామండ పమునఁ గూర్చుండి సూర్యోపాసన సేయుచుండెను. అంతలో నొక భటుఁడు వచ్చి "మహారాజా! ద్వారమున నొక బ్రాహ్మణుఁడు తమ దర్శనార్థము వేచియున్నాఁడు" అని సవినయముగా నివేదించుకొనియెను.

కర్ణుని దేహము ప్రమోదపులకితమైనది. వదనమున చిఱునగవు చిందులాడినది. "సత్వర మా మహాత్ముని ప్రవేశపెట్టు"మని సేవకుని నాజ్ఞాపించెను.

బ్రాహ్మణుఁడు లోనికిఁ గొనిరాఁబడెను. కర్ణుఁ డా భూదేవునికి భక్తిపూర్వకముగా నమస్కరించి యొక యాస నముఁ జూపెను. కపటభూసురుని కాలుసేతులు గడగడ లాడుచుండుట కర్ణుఁడు గుర్తింపకపోలేదు. వారిరువుర కిట్లు సంభాషణ జరిగెను.

"స్వామీ! తమ రేమి పనిమీఁద వచ్చితిరి?"

"రాజా! నా కోరిక సఫలీకృత మగునని వాగ్దానము సేయుదువా?"

"స్వామీ! కర్ణుఁ డెవ్వ రేది యడిగినను లేదనక నిచ్చు నిండుమనము గలవాఁడు. తమ యభిలాష దీర్చుట కీ యంగ రాజు సిద్ధముగా నున్నాఁడు."

"కుమారా! ఆ విషయము మేము కర్ణాకర్ణికగా విని చాల దూరమునుండి ప్రయాస కోర్చి వచ్చితిమి."

"స్వామీ! తమ రేమి కోరుదురో తెల్పుఁడు. లక్షల కొలఁది దంతావళములా? సర్వసంపదభిరామములగు నగర రాజములా? నిర్మల క్షీరసంపన్నములగు గోగణములా? మహోన్నత రాజభవనములా? అసంఖ్యాక ధనకనక రాశులా? అవియెల్ల నభిలషణీయములు కావేని నా యంగ రాజ్యమును ధారవోయుమందురా? మీ రేమి వాంఛింతురు?"

"రాజా! నా కవి యేమియు నక్కఱలేదు. కాని నా కాంక్ష దెలిపితినేని కర్ణుఁడు ప్రతిభంగమాచరించునేమో యని సందేహించుచున్నాను."

"స్వామీ! కర్ణుఁడు నియమోల్లంఘన మాచరించెనా తారకలు నేల రాలును. సూర్యభగవానుఁడు తేజో విహీనుఁ డగును. ఇక సంశయింపకుఁడు. తమ యభీష్ట మెఱిఁగింపుఁడు."

"కర్ణా! అట్లైన నీ వజ్రకవచమును స్వర్ణకుండలము లును నా కొసంగవలయును."

అని యనుచుండఁగనే బ్రాహ్మణుని వదనము వాడి పోయెను. కన్నులలో చంచలత్వము కనుపించెను.

ఆ మాటలు విని యసామాన్యవదాన్యశిరోమణియగు కర్ణుఁడు కుహనామహీసురుని వీక్షించి "స్వామీ! ఇదుగో ఇచ్చుచున్నాను." అని పలికి నిజకరవాలముం గ్రహించి కర్ణములనున్న కుండలములు కోసియిచ్చి తరువాత దేహము నంటియున్న వజ్రకవచమును నిస్సంశయముగా ఖడ్గముతో పరపర తెగఁగోసి యా బ్రాహ్మణోత్తమునకు పరమహర్ష ముతో దానము చేసెను.

కర్ణుని దాతృత్వమహత్వమునకు మెచ్చుకొని పుణ్య దేవత లతనిపై పూలవాన కురిపించిరి. ఆ మహోజ్జ్వల దృశ్య మును చూచి ప్రకృతి నిస్తబ్ధమయ్యెను.

కర్ణుని శరీరమునుండి రక్తము కాలువలుగట్టుచుండెను. దానవీరుఁడు లజ్జావనతవదనుఁడై యున్న ధరణీసురుని గని "స్వామీ! తమ రింకను నేమియో శంకించు చున్నారే! మఱేమైన వాంఛింతురేని తెల్పి నన్ను కృతార్థుని జేయుఁడు." అనెను.

బ్రాహ్మణుని కంఠము రుద్ధమయ్యెను. "కుమారా! నాకింక నేమియు నవసరములేదు. కాని..."అని బ్రాహ్మణుఁ డాగిపోయెను.

"నాకేమి యాజ్ఞయో, తెల్పుఁడు స్వామీ!" అని కర్ణుఁడు వేఁడుకొనెను.

"కుమారా! నీవు నన్నేదైన ప్రతిఫలము గోరవల యును."

"స్వామీ! కర్ణుఁ డిచ్చుటయేగాని పుచ్చుకొనుట యెఱుఁగఁడు." అని దానవీరుఁడు ప్రశాంతవచనములతో సమాధాన మిచ్చెను. కర్ణుని హృదయదార్ఢ్యమున కచ్చెరు వంది యా మహిమాన్వితునికడ తనరహస్యము నింకను కప్పిపుచ్చుట తప్పని తలంచి కపటభూసురుఁడు శతక్రతుఁ డయ్యెను.

రాధేయుఁ డమరనాథునకు సాష్టాంగ దండప్రణామ మాచరించి "మహాత్మా! కర్ణుని జన్మము నేఁడు సార్థక మైనది. దేవరాజా! తమ రిట కరుదెంచుట నా మహా భాగ్యము. తమరు నాకడకు వత్తురని వీనిని యాచింతురని సూర్యభగవానుఁడు స్వప్నమునఁ జెప్పియే యున్నాఁడు." అని నుడివెను.

పాకశాసనుఁడు ససంభ్రముఁడై "కర్ణా! నీ వభివంద నీయుఁడవు. నీ సత్యనిరతి నిర్జరస్తుత్యము. నీ కీర్తి యాచంద్ర తారార్కము చెన్నారుఁగాక! నీ శరీరము తొల్లిటివలె శోభిల్లుఁగాక! నిన్ను వంచింపఁదలంచి వచ్చితినని యెఱింగియు ప్రాణసమానము లైన వీనిని దాన మొసంగిన నీ వెంతటి సాహసివోయీ!" అనునంతలో కర్ణుఁ డందుకొని "సుర సార్వభౌమా! ముప్పదిమూఁడుకోట్ల దేవతల కధినేతవై యే కరముతో వారి కభయ మిచ్చుచుందువో, పదునాల్గు భువనములలో ధర్మప్రతిష్ఠ చేసి యే కరముతో శాంతిసత్య ములు కాపాడుచుందువో, కల్పవృక్షమునందలి మధుఫల

ముల నే కరముతో స్పృశించుచుందువో, కామధేనువు పిఁపు నే కరమున ప్రేమతో నిమురుచుందువో, అమృతకలశము నే కరమున నందుకొనుచుందువో, ఆ సకల శుభంకరమగు నీ కరము క్రిందనుండి నాచేయి పైన ఉండుటకన్న నా కింక జగతిలో వాంఛింపఁదగిన మహాదృష్ట మేమున్నది ?

"ఎందఱు చక్రవర్తులు నిర్వక్ర పరాక్రమమున నీ ధరణీ చక్రమును పాలించి గతించిపోయిరి ! వారి భోగభాగ్యము లన్నియు ననంత కాలగర్భమునఁ గలసిపోలేదా ? వారి వైభవములెల్ల రూపఱి పోలేదా ?

"నిర్జరేశ్వరా ! తెలిసియుండియు నిండుప్రాణమును బలియిచ్చిన బలిచక్రవర్తి వదాన్యత మీ రెఱుంగరా ? మీ రెల్లరుఁ బరీక్షింపఁ బోయినపుడు మేనికండలు గోసి యిచ్చిన శిబిరాజేంద్రుని దాతృత్వమహత్వము మీ స్మృతి పథమునుండి తొలఁగిపోయినదా ? మహేంద్రా ! వారి సత్కీర్తి శాశ్వతమై యుండలేదా ? పుణ్యపురుషా ! నాయశ స్సౌధమును చిరస్థాయిచేసిన మీకు నా కృతజ్ఞతాపూర్వక వందనములు." అని పలికి వినయ వినమితోత్తమాంగుండై యున్న యతిరథ నందనునిం గని పురందరుండు దయార్ద్ర హృదయుండై "అంగరాజా! పరుని జీవితైక భాగ్య మన్యాయ ముగా స్వార్థబుద్ధియై యపహరించిన నాకలోక నాయకునికి నిష్కళంక మతివై నమస్కరించు నీ సౌజన్య సౌహార్దములు నిఖిలలోక శ్లాఘనీయములు. భూతభవిష్యద్వర్తమానము

లలో నీవే పుణ్యమూర్తివి. చతుర్దశ భువనములయందును నీవే దాన వీరాగ్రగణ్యుఁడవు. నీ కేదే నొక పారితోషిక మీయ నెంచితిని. ఇదిగో! ఈ మహాశక్తిని భక్తితో పరిగ్రహింపుము. వలదనకుము. ఇది దుర్జయుఁడైన నీ శత్రువు నొక్కని మాత్రము పరిమార్చి మరల నన్నుఁ జేరగలదు. దీనిచే ప్రాణత్రాణంబు గావించుకొనుము. నేనిఁకఁ బోయి వచ్చెదను." అని పల్కి కర్ణుని కమోఘశక్తి ననుగ్రహించి యమరేశ్వరుఁడు నిజలోకమునకుఁ జనియెను. రాధేయుఁడు ప్రశాంత హృదయుఁడై ప్రాసాదములోని కరిగెను.

## దశమ ప్రకరణము

అది శరద్రాత్రి. సుధాకరుఁడు ప్రసాదించు శుభ్ర జ్యోత్స్నలో ప్రపంచము ప్రహర్షపులకితమై నిద్దుర వోవు చుండెను. ఆ ప్రశాంతమూర్తికి సహచరుఁడైన బాలసమీరుఁడు తన ప్రభావమును చూపుచుండెను. తారాపరీవృతుఁడైన యమృతాంశుఁడు మానవమంగళమార్గదర్శకములగు రమణీయ మధురగీతికలలో మైమఱచిన ట్లున్నాఁడు. ఆ శుభసమయమున నా రాజప్రాసాదముపై నేకాంతముగా నటునిటు పచారులుసేయు నా సుందర సువర్ణ సురుచిర స్వరూపుఁ డెవరు? ఆ ధీరోదాత్తుని చిత్తమున నెన్ని భావము లిమిడియున్నవో? ఆ కమనీయకల్యాణవిగ్రహుఁ డేకతమున నంత దీర్ఘాలోచనము సేయుచున్నాఁడో? ఆతని సముజ్జ్వల

వీక్షణములలో నమోఘగాంభీర్యము ప్రతిబింబించుచున్న దే! అపును; అతఁ డేవో రాజతంత్రాంగముల నూహించుచు తనలో తాను మహార్ణవసంచలనమును మఱపించునట్లు తిక మక పడుచున్నాఁడు.

ఆ యువకుని దగ్గఱ కెవరో యొక్క స్త్రీమూర్తి వచ్చినది. ఆమె దేహమున తెల్లనిచీరెయును మేలిముసుఁగుగా నల్లనివస్త్రమును ధరించియున్నది. ఆ స్త్రీమూర్తి ముఖముపై నున్న ముసుఁగు నొత్తిగించి "నాయనా!" యని పిల్చినది. ఆమె కుంతీదేవి. ఆ యువకుఁడు కర్ణుఁడు. అతఁ డకస్మాత్తుగా నటకు వచ్చిన యామెను చూచి నిశ్చేష్టుఁ డాయెను. అతఁ డేమో యనఁబోయెను. కాని నోటమాట పెల్లగిలలేదు. అతనికి మాత్ర మాలోచనాసమగ్రత లేదా! తన దగ్గఱకు మధ్యరాత్రిలో తన శాత్రవుల తల్లి యేమియో యవసర ముండి వచ్చుట యాశ్చర్యముకాదా! ఈ యనూహ్యాసన్ని వేశమున కర్థ మేమిటో!

అతఁడు భక్తిగౌరవపురస్సరముగా "అమ్మా! రండు. ఇటఁ గూర్చుండుఁడు. నాతో మీ కేమి పనిగల్గినది తల్లీ! ఈ నిశీథమున వచ్చితిరి?" అని కుంతీదేవి నడిగెను.

అందులకుఁ గుంతి "నాయనా! నీతో నవసరమగు పనియుండియే యీ యవసరమున వచ్చితిని. ఈనాఁడు నీతో నొక పరమరహస్యమును చర్చింపవలసియున్నది." అనియెను.

"నాతోనా అమ్మా!" యని యతఁ డాశ్చర్యముగాఁ బ్రశ్నించెను. "అవును నాయనా! నీతోనే. ఈ నాఁటితో నాలో నిండి నిబిడీకృతమై యున్న యొక హృదయవిదారక సంఘటనము బయల్పడి నా మానసము నొకింత తేలిక చేయును." అని కుంతి తనయభిప్రాయమును చూచాయగా నెఱింగించెను. "అయిన నాలస్య మేలనమ్మా! రాధేయుని ముందు రహస్య సంభాషణమునకుఁ దావు లేదు. దాపరికము నకు ప్రాపు లేదు. చెప్పనెంచినదేమో చెప్పు తల్లీ!" అని యింకను నేమియో మాటలాడఁబోవుచున్న కర్ణుని సంభాషణమధ్యమున నాపి "నీవు రాధేయుఁడవు కావు నాయనా!" అని కుంతి కన్నీరు మున్నీరుగా నేడ్చినది.

కొంతవడికి తెప్పఱిల్లి పొంగివచ్చు దుఃఖతరంగముల నాపుకొనుచు "కర్ణా! సావధానుఁడవై యొక కష్టచరితము నాకర్ణింపుము.

"ఒకానొక మహారాజున కొక పుత్రిక యుండెడిది. అతఁ డామెను కడుంగడు గారాబముతో పెంచుచుండెడి వాఁడు. ఒకనాఁడు వారిభవనమునకు దుర్వాసమహా మునీంద్రుఁ డతిథియై వచ్చెను. ఆ మునివర్యుని మఱికొన్ని దినము లందే యుండి తన యాతిథ్యము స్వీకరింపవలసినదని యా మహారాజు ప్రార్థించెను. దుర్వాసుఁ డంగీకరించెను. ఆ మునిశేఖరునకు పరిచర్య సేయుటకై మహారాజు తన ముద్దులకొమరితను నియోగించెను. కొన్ని దినములుగడచినవి.

ఒకనాఁడు దుర్వాసుఁ డా రాకుమారి భక్తిశ్రద్ధలకుఁ గరుణించి యామె కొక దివ్యమంత్ర ముపదేశించెను. అంత నామె యొకనాఁటి ప్రాతఃకాలమున బాలభానుని జూచుచు నామంత్ర ముపాసించెను. ఆ మహామంత్రప్రభావమున రాగోజ్జ్వలుఁడగు భాస్కరుఁడు దిగివచ్చి యా రాకుమారి కొక ముద్దుబిడ్డ నిచ్చి వెడలిపోయెను. పాప మా కన్య కా పాపని నేమి చేయవలెనో తోఁచలేదు. ఆత్మాభిమాన రక్షణ మును, లోకాపవాదభయమును రాకుమారిని బిడ్డతో పాటు గంగలోఁ గలిసిపొమ్మని ప్రబోధించినవి. నీటం బడఁబోవు నంతలో నా ప్రవాహమున నొక్క మందసము కొట్టుకొని వచ్చినది. ఆమె కొక యాలోచన తట్టినది. ఆ పెట్టెను మెల్లగా నొడ్డునకుఁ దెచ్చి పట్టి నద్దానఁ బరుండఁబెట్టి బాధామయ హృదయముతో నీటిలో వదలిపెట్టినది. ఆ పెట్టె యెట్టెటో యొక సూతునికి దొరకినది." అని కుంతి కథ కొంతసేపటివఱకు చెప్పలేకపోయినది.

"అయిన నీకథకును నాకును సంబంధ మేమిటమ్మా?" యని కర్ణుఁ డామెను ప్రశ్నించెను.

పరితాపపరిక్లిన్న మానసయగుచు నామె మరల నారంభించి "నాయనా! ఆ బాలుఁడవు నీవే! రాధేయుఁడని పిలువఁబడుచున్న నీవే తండ్రీ! నీతల్లి — కఠినహృదయ; నాఁటి రాకుమారి యిదిగో! నీ ముందే యున్నది. నీతో మాటలాడుచున్నది." అనునప్పు డామె హృదయమున

దావానలము ప్రజ్వలిత మయ్యెను.

ఆ మాటలు వినినంతనే కర్ణుఁ "డమ్మా! నీవు నా తల్లివా! ఇన్నినాళ్ళు నాకేల తెలుపలేదమ్మా!" అనుచు నామె చరణకమలములకు నమస్కరించెను. కుంతీదేవి "కుమారా!" యనుచు కర్ణుని కౌఁగిలించుకొనినది. ఆ మాతాసుతుల ప్రేమార్ద్ర హృదయములలో ముజ్జగము లుప్పొంగ లూగినవి. ఆతని మాతృభక్తి యామె వత్సలత కంకితమైనది. అతని నేత్రములనుండి రెండు కన్నీటి బిందువులు మాతృభక్తిని చిత్రించుచు నామె కరములపై రాలి పడినవి. అతనిలో నేదో యవ్యక్తమగు బాధ కన్పట్టినది.

"కుమారా! నే నస్వతంత్రురాలను; అబలను. సంఘము నెదిరించి జీవించు స్వేచ్ఛ నాకు లేదు. విధి దుర్లంఘ మైనది.

"నాయనా! అస్త్రవిద్యాపరీక్షా సందర్భమున సూతపుత్రుఁడవని సభామధ్యమున నవమానింపఁబడినప్పుడును, సూతకులజుని వరింపనని స్వయంవరమంటపమున సకల మహీపతుల యెదుట పాంచాలి పరిహసించినప్పుడును, సహస్రకరుని దయావిశేషముచే నార్జించుకొనిన కవచకుండలముల నాఖండలునికి నిశిత కరవాలమునఁ గోసి యిచ్చితి వని విని నప్పుడును నా మాతృహృదయ మెంత క్షోభించినదో గుర్తింపఁగలవా? తండ్రీ! సర్వోర్వీపతులను జయించివచ్చితి వనుమాట వినినప్పు డెంత సంతసించితినో యెఱుంగుదువా?

"కుమారా! కౌరవ పాండవ యుద్ధము నిశ్చయము. అందు నీవు నీ సహోదరులతోఁ బోరుసలుపుచుండ నీ కన్నులతో నాదుర్భరదృశ్యము నెట్లు చూడఁగలను! తండ్రీ! నిన్ను నీ తమ్ములలోఁ జేర్చుటకే నీదగ్గఱకు వచ్చితిని." అని దీనాలాపము లాడుచున్న కుంతినిజూచి "ఈ దీనాలాపములు క్షత్రియాణి మాట్లాడఁదగినవి కావమ్మా! అసంభవములను సంభవములుగ భావింపఁగూడదమ్మా!" అని కర్ణుఁడనెను.

కుంతీదేవి యీ మాటలు విని "నాయనా! నేనొకప్పుడు భారతరాజ్యేశ్వరినే. భాగ్యము లనుభవించినదాననే. కాని బ్రతికినన్నాళ్ళు బాధపడుమని బ్రహ్మదేవుఁడు నా నొసట వ్రాసినాఁడు. నే నేమి చేయఁగలను? నా మాట విను నాయనా!" యని యర్థించు తల్లిదైన్యమును గని కర్ణుఁడొకింత సంభ్రమపడినాఁడు; కాని వెంటనే గుండె దిటవు పఱచుకొనినాఁడు.

"అమ్మా! ఆశలు వీడిన నీకొడుకు కఖండ వైభవుండై నీకంటఁబడుటకు రారాజే కారణభూతుఁడు. నన్నతిస్నేహమున నిన్నినాళ్ళనుండి యభిమానించు రారాజును మోసపుచ్చి కృతఘ్నుఁడనను యపప్రథ నందుమందువా? నా మీఁద నాశ పెట్టుకొని సర్వప్రపంచమును ధిక్కరించి యుద్ధమునకు దుర్యోధనుఁడు సిద్ధమైనాఁడు. నా మైత్రి నాశించి సూతుఁడనని పిలువఁబడుచున్న నన్ను మహారాజును

చేసినాఁడు. ఈ నాఁడు నేను పాండవాగ్రజుండనని యుతనిని విడిచిపోయితినేని యాతఁ డెంత చింతించును? స్వార్థ చింతతో నాశాపిశాచావేశిత మనస్కుండనై విశ్వాస ద్రోహము సేయుట న్యాయమా! అమ్మా! నీకేమి! నీవు వీరమాతవు! నీ యాత్మజుఁడు నిఖిల దేశములను జయించి నాఁడు. నిర్జరేశ్వరుని ప్రశంసల నందినాఁడు. ఇఁక స్వామిభక్తి పరాయణుఁడై శాశ్వత యశఃకామి యగుచున్నాఁడు. నీవు ధన్యురాలవమ్మా!

"నే నీనాఁడు నీ వెంటవచ్చి పాండవులతోఁ గలిసినచో భూవలయము రాజద్రోహియని మిత్రద్రోహియని నన్నా క్షేపించును. నా స్వార్థకాంక్ష నన్నధర్మయుతుని జేయును. క్షమించు తల్లీ! దేహములు నశ్వరములు. కాని జీవితమం దవలంబించిన ధర్మమార్గమే నిత్యము. ఆ ధర్మమే మానవుని మహోన్నతిఁ గూర్చును.

"కర్మవీరుఁడైన నీ పుత్రుని చరిత్రము భారతాఖ్యాన ములో స్వర్ణపంక్తులలో సొంపులు నింపుకొని లిఖింపఁబడ గలదమ్మా! భావి భారతము నీ కుమారునికి జోహారు సేయుటకన్న నీకుఁ గావలసిన దేమున్నది?

"తల్లీ! నీ యావేదన నా కర్థమైనది. నీబాధ నా కవగత మైనది. మాతృప్రేమను శంకించు మూర్ఖుఁ డెవరమ్మా! నీ విఁక విచారింపకు తల్లీ!

"పాండవులకు ప్రాణభయము వాటిల్లునని భయపడి

నాకడ వర మర్థింపవచ్చితివి. కాని నీ వడుగ లేకున్నావు! నీకంత దైన్య మేలనమ్మా! నీకు సంతోషము కలుగునట్లు నేనే యీవర మిచ్చెదను. చిత్తప్రశాంతి నందుము తల్లీ!

“అమ్మా! ఫల్గుణుఁడుతప్ప తక్కిన పాండవులు సమరమున నా చేఁజిక్కినను సంహరింపను. అర్జునుఁడు జయించెనా పంచపాండవు లట్లే యుందురు. కాక నేనే గెలిచితినా నాతో పంచపాండవుల మగుదుము. నావిషయము మాత్రము తమ్ముల కెఱింగింపకుము. ఇఁక పోయిరా తల్లీ!” అని కర్ణుఁడు తల్లిని వెంటఁదీసికొని ప్రాసాదము నవరోహింపసాగెను.

ఆమె వదనమున నిరాశ పొడసూపినది. ఆమె విషణ్ణవీక్షణములకు ప్రళయభూతము వెయ్యినాలుకలు తెఱచుకొని విఱుచుక పడనున్నట్లు కన్పించినది. కర్ణుని కనుదోయిలో సహజన్ములును మిత్రుఁడును ప్రతిబింబించుచుండిరి.

## ఏకాదశ ప్రకరణము

అది ధృతరాష్ట్రమహారాజు కొలువుకూటము. వైచిత్రవీర్యుఁడు వైభవోపేతుండై వజ్రపీఠము నలంకరించి యుండెను. మహారాజున కించుక దూరమున నీలమేఘశ్యాముండును, శిఖిపింఛధరుండును, నళినదళనయనుండును, మందస్మితసుందరవదనారవిందుండును, మాణిక్యాంచితమంజులాభరణుండును నైన పాండవరాయబారి శ్రీకృష్ణభగవానుండు నవరత్నఖచిత సింహాసనమున నుపవిష్టుండై విరాజిల్లు

చుండెను.

ధృతరాష్ట్రుని కుడిప్రక్క భీష్మవిదురాది కురువృద్ధులును, ద్రోణకృపాశ్వత్థామాది గురుపుంగవులును, జగత్కల్యాణకారకంబగు శ్రీకృష్ణరాయబార కార్యక్రమంబునుగాంచు కౌతూహలముతో దయచేసిన నారద జమదగ్ని జాబాల్యాది బ్రహ్మర్షులును కూర్చుండియుండిరి; ఎడమప్రక్క కర్ణ వికర్ణ శకుని సైంధవ దుశ్శాసన ప్రముఖులతోఁగూడి దుర్యోధనుండు సముచితాసనంబు నధివసించి యుండెను. సభను దిలకింపఁగోరి హస్తిపురవాసులు లెక్కకు మిక్కుటముగా విచ్చేసిరి.

పాండవదూత శ్రీకృష్ణుఁడు సభాసదులెల్ల వినుచుండ నీ భంగి సంధి ప్రసంగము గావించెను.

మామా! హస్తిపుర సార్వభౌమా! మాయాద్యూతోదరమున తమ సర్వస్వమును గోల్పోయిన నీ యనుజ తనయులు ప్రతిజ్ఞానుగుణ్యముగా నరణ్యాజ్ఞాతవాసములు పూర్తి గావించుకొనినారు. తమ యర్ధరాజ్యమును తమ కిప్పింపుమని నా ముఖమున నిన్నిప్పు డర్థించుచున్నారు. పాండవుల విశుద్ధ వర్తనము—వినయ వివేకములు—విజయ విఖ్యాతులు—నీ వెఱుంగనివి కావు. వారి వేఁడికోలు మన్నింపుము. ధర్మౌదార్యములకును నీతి నియమములకును కరుణానురాగములకును నిలయమైన భారతవంశమున జనించినవాఁడవు. మీ కులగౌరవము నిలుపుకొనుము. ఈ యవకాశమును

జారవిడుచుకొంటివా సకల క్షత్రకుల నాశకమగు మహా సమరాగ్నికుండలమున నాజ్యము పోసినవాఁడ వగుదువు. నిఖిలజన నిందితుఁడ వగుదువు. చక్రవర్తీ! నీ తమ్ముని కొడుకులు దిక్కులేక దేశభ్రష్టులై దీనావస్థఁ ద్రిమ్మరుచుండ నీ గౌరవమునకు లోటువాటిల్లదా? నీరక్షీరముల వలె కలసి మెలసి యుండవలసిన కౌరవపాండవు లన్యోన్య ద్వేషము లతోఁ గలహించుకొనుట నలుగురిలో నీకు తలవంపులు కాదా?

"మహారాజా! నీ పుత్రు నొప్పించి పాండవులైదు గురికైదూళ్లైన నిప్పించి తరువాత నిష్కంటకముగా నీ సుతులచే నీ ధరాతలంబెల్ల నేలించుకొనుము. అట్లుకాదా! సంగ్రామము జరుగక తప్పదు. అందు నీ బంధువులేగాక నీ సుతశతంబును నిహతమై తీరును. ధర్మజుని నైతిక బల మును, అనిలసూతి గదాబలమును, పార్థుని బాహుబల మును, కవల ఖడ్గచాలనము నొక్కపరి స్మరించుకొనుము. దుర్యోధనునకు విద్యుక్త ధర్మములను బోధింపుము.

"మునిచంద్రులారా! కురు గురు వృద్ధులారా! మీరును ఈరాయబారము సఫలమగుటకు యత్నింపుడు."

ధృతరాష్ట్రుని మానసాకాశమున నెన్నియో కారు మబ్బులు గ్రమ్మినవి. మహారణములో మారణమందిన కౌరవు లొక ప్రక్కను, భీతుఁడై దిక్కులేని తనకు దయతో పిడికెడన్నముఁ బెట్టవచ్చు కుంతి యొకప్రక్కను నాతనికి

గోచరించినారు. సంగ్రామము నాపుటకు తన కెంత బాధ్యత గలదో యతఁడు వెన్వెంటనే గుర్తించినాఁడు. సుయోధనుని చేరఁబిల్చి "నాయనా! రాయబారి మహా మహిమాన్వితుఁడగు మధుసూదనుఁడు; వైరులు స్తవనీయ పరాక్రములగు పాండునందనులు; సంధి కోడంబడని ఫలితమా సర్వనాశనము; వారు వాంఛించినదా ఐదూళ్ళు. నీ సువిశాల సామ్రాజ్యములో నైదు గ్రామములు లేకున్న నీకేమి కొఱత గల్గును తండ్రీ! మన మహారథులకు సంధి ప్రస్తావన శ్రావ్యముగ నున్నది. పాండవులతో మైత్రి గావించుకొని సుఖంబుగ నుండుము. కుమారా! ముదుసలులమగు మా కడుపున చిచ్చు బెట్టకుము. జనార్దనునకు సరియగు సమాధాన మిచ్చి సగౌరవముగా పంపింపుము." అని యాదేశించినాఁడు.

అంతలో ప్రశాంతమూర్తి శాంతనవుఁడు రారాజు నుద్దేశించి "దుర్యోధనా! నీ తండ్రి చెప్పిన తెఱంగు శ్రేయోదాయకంబు. దూతయై వచ్చిన పురుషోత్తముని మాట పాటింపుము. మేమో శతవృద్ధుల మైతిమి. ఈ వార్ధక్యమున 'కృష్ణా రామా' యని భగవన్నామ ధ్యాన మొనర్చుకొననీక మాచేత ధనుస్సు పట్టింతువా? ఈ సూతసుతుని యండ చూచుకొని సుడిగుండములోఁ బడకుము. పచ్చని రాజవంశమును పాడుసేయకుము. పాండవులకు పాలొసంగుము." అని యుద్బోధించినాఁడు.

అనంతరము కులగురువు ద్రోణాచార్యుఁడు దుర్యో

ధనుని గాంచి "కౌరవేశ్వరా! గాంగేయుని వాక్యములను ప్రత్యాఖ్యానము గావింపకుము. మీరును వారును మా యంతేవాసులే. ఇరువురపైనను మాకభిమానము సమానమే; కాని పాండవులు సధర్ములు. ధర్మపథమునకు విజయమే గమ్యస్థానము. పెద్దలు సెలవిచ్చిన విధముగా సంధి వచనము లంగీకరించి యెట్లైనను వారితో విరోధము లేకుండఁ జేసికొనుము. 'పోరు నష్టము పొందు లాభము' అను నార్యోక్తి నీ వెఱుంగనిది కాదు. అతిసూక్ష్మగ్రాహివగు నీతో నుడువఁ దగిన దొండు లేదు." అని హితోపదేశము చేసినాఁడు.

తరువాత నఖండవైదుషీ సమేతుండగు విదురుండు దుర్యోధనుని వీక్షించి "కుమారా! తల్లికి, తండ్రికి, పితామహునికి, గురునకు, బంధుగులకు, ప్రజలకు, పాండవులతో స్నేహము గావింపఁ దలంపు గల్గినది. నల్గురికి నంగీకృతమైన త్రోవం బోవుము. నీ వారందఱు నీ శుభము గోరి చెప్పువారే గదా! ఒక్కింత శాంతమతివై సత్యనిరతులగు ధర్మజాదులతో సంధి గావించుకొనుము. చేతులార నీ భాగ్యక్షీరభాండమునఁ గాలకూటము గలుపుకొనకుము" అని హెచ్చరించినాఁడు.

అనంతరము తక్కంగల సభాప్రముఖులును, ప్రజానాయకులును తమ యభిప్రాయము లెఱింగించినారు. జనరంజకుండును, అమోఘసత్వసంపన్నుఁడును, అగణ్యపుణ్యుండు నగు పాండవాగ్రజుఁడు భూమండల పాలకుం

డగుట న్యాయ మనియు రారాజునకు విన్నవించుకొనినారు.

కాని హితబోధకుల సంధి సూచనలు రారాజు చెవి కెక్కలేదు. అవియెల్ల బధిరుని ముందు శంఖమూదినట్లు నిష్ఫలములై పోయినవి. సుయోధనుడు క్రోధాందోళిత హృదయముతో రాధేయునివంక దృష్టి సారించినాడు. కర్ణుని కనుబొమలు ముడివడుట గమనించినాడు. సభను వీక్షించి మీసము దువ్వినాడు.

దుర్యోధనుని ముఖలక్షణములు కనుంగొని యుపేంద్రుడు మరల నేమియో నుడువ నుపక్రమించెను.

"రారాజా! సోదరులలో విరోధములు వినాశహేతువులు. మీలో మీ కైకమత్యము గలదేని త్రిలోకములు కలిసివచ్చినను మిమ్ము తేరిచూడజాలవు. మాత్సర్యమునకు నీ హృదయమున స్థానము నీయకుము. వీరమ్మన్యుల కల్లబొల్లి మాటలు నమ్మి కయ్యమునకు కాలుదువ్వకుము. పచ్చని పంటచేలతో కళకళలాడు భారతభూమిలో రక్త ప్రవాహములు పొంగింపకుము. ప్రశాంతమైన దేశమున భీభత్సవాతావరణము నెలకొల్పకుము. మీ వివాదముల కోసమై యెందఱు విగతజీవు లగుదురో ఎందఱు హతభాగ్యు లగుదురో ఎందఱు శోకవ్యాకులితు లగుదురో ఎందఱు తత్కారకుడవగు నిన్ను దుమ్మెత్తి పోయుదురో నీవే తలపోయుము. అన్నింటికన్న పండుముదుసలులైన పితామహాదులను పోలికలనులో హతము సేయకుము. మున్ను

నీవొనర్చిన పురాగతము లెల్ల విస్మరించి పాండవులు జగద్రక్షణార్థము నన్ను నీ కడకు రాయబారిగా నంపినారు.

“కౌరవేశ్వరా! ధర్మజుఁడు సౌజన్యధన్యుఁడు. అతని యాత్మబలమును మీ పశుబల మతిక్రమింపఁ జాలదు. యుధిష్ఠిరుఁ డాగ్రహించి యాహవమధ్యమున నిల్చినా కర్ణాదులను కోటిమందినైనను గోటమీటఁగలఁడు. అవార్య శౌర్యధుర్యుండగు గాండీవి దేవదత్తము నొత్తుచు నీమూఁకల పైఁబడి చించి చెండాడునపుడు నీకు దిక్కై నిల్చువా రెవ్వరును లేరు.

“దుర్యోధనా! ప్రతిజ్ఞానిర్వహణ ధౌరేయుండును, ప్రతాప దీపితుఁడును నగు సమీరకుమారుండు నీ తమ్ముని రొమ్ముఁ జీల్చి రక్తమును ద్రాగునప్పుడును, నీ తొడలు విఱుగఁగొట్టి రణభూమిలోఁ బడఁద్రోయునప్పుడును నీతో రాయబారము జరుగఁబోదు.

“సుయోధనా! బంధుక్షయంబునకు జంకియైన పాండవుల యర్ధరాజ్యము వారి కర్పింపుము.” అని యచ్యుతుఁడు ప్రత్యుత్తరమునకై ప్రతీక్షించుచుండెను.

రారాజు కనులనుండి యగ్నికణములు రాలుచున్నటు లుండెను. ఒకపరి పాండవమిత్రుఁడగు మాధవుని జూచినాఁడు. మఱియొకపరి తన ప్రియమిత్రుఁడగు రాధేయుని గాంచినాఁడు. ఈ చూపులో ‘మిత్రుఁడేలకో మిన్నకున్నాఁడే, అను భావము ద్యోతక మగుచుండెను.

అంతట కర్ణుఁడు లేచి "పాండవదూతా! రాయబారమునకై నీవంటి వ్యర్థభాషణుని పంపుటలోనే పాండవుల యుచితజ్ఞత తేటతెల్లమైనది.

"ధర్మవిదురులారా! సభాసదులారా! రాజ్యాధికారము జ్యేష్ఠవంశములోనిదే కాని కనిష్ఠవంశములోనిది కాదని మీ రెఱుంగుదురు. ఇంతవఱకు ప్రపంచమున నాయాచారమే పాటింపఁబడుచున్నదిగదా? సామ్రాజ్యమును చీల్చి యిమ్మనుట యవివేకము కాదా? ఆ మాటలో న్యాయము కలదా? ఒక రాజ్యమును నిరువురు రాజులు పాలించుట యపూర్వ విదితము. నేఁటిదనుక నెవ్వరును రాజ్యమున భాగము పంచుకొనలేదు. ఏకచ్ఛత్రాధిపత్యము తొలంగిపోయెనేని రాజ్యము బలహీనము కాదా? నేఁటి యంతఃకలహములు నివారించుట కట్లు చేసితిమేని నాఁడు మాత్ర మంతఃకలహము లేల రాకుండును? అదిగాక పాండురాజు కొంతకాలము రాజ్యము నేలెఁ గావున నాతని సుతులకు పాలిమ్మందురా? అట్లైనను ధర్మజాదులు పాండుపుత్రులు కారు. వారు యమానిలేంద్రాశ్వినుల నందనులు. వారికి రాజ్య మిమ్మనుట మీ పక్షపాత ప్రదర్శనమునకు ప్రత్యక్ష నిదర్శనము.

"లేదా! పాండవాగ్రజునకు యౌవరాజ్యాభిషేకము జరిగినది కాన రాజ్యముపై హక్కు కలదందురా! వారు దుర్వ్యసనపరులై వేడుకగా జూదమాడి తమ సర్వస్వము

నాఁడే యోడిపోయినారు. పాండవులు నిజముగా నభిమాన ధనులైన నాఁ డాంబికేయుఁడు శీతమైన ద్రౌపదికి భిక్షగా నిచ్చిన యర్ధ రాజ్యమున కాశింతురా! ప్రగల్భోక్తులు కట్టి పెట్టి యభిమానహీనులై రాజ్యము నిమ్మని ప్రార్థించిన మా ప్రభువు దానము సేయఁగలఁడు. క్షత్రియపుత్రులు నిక్క మగు పౌరుషము గలవారేని సంగరరంగమున వీరాధివీరులై విజృంభించి శాత్రవులనోంచి రాజ్యము సంపాదించుట యుక్తము. అంతేకాని తమకులేని యధికారమును సృష్టించు కొనుట మంచిపని కాదు.

"గదలు గాండీవములు చూపి బెదరించిన నదరిపోవు పిఱికిపంద లెవ్వరు నిచ్చుటలేరు. ప్రతాపమును ప్రస్తు తించుకొనుటకన్న రణప్రాంగణమున ప్రకటించుటలోనే శూరవరుల ప్రత్యేకత భాసించుచున్నది.

" నందనందనా! మరణము గాంతు రన్న మాత్ర మున మహారథుల మనస్సులు చెదరుననుకొంటివా? 'దేహ మనిత్యము—పుట్టిన ప్రతిప్రాణియును గిట్టక తప్పదు.' అని యెవ్వరెఱుంగరు! ప్రభుభక్తిపరాయణులై వీరమరణము నందుట యోధులకు బాధాకరము కాదు. అదియును గాక జయాపజయములు దైవాధీనములు. బ్రతికి సౌభాగ్య మనుభవించుటో, చచ్చి వీరస్వర్గ మందుటో కాని పిఱికి పందలవలె పాండవులకు భయపడి కౌరవులు రాజ్యమిత్తురా! అసంభవము. అట్లెన్నటికిని జరుగరాదు." అని తన యిష్ట

మును స్పష్టీకరించెను.

రాధేయుని యుచిత ప్రసంగమునకు రారాజు ప్రహృష్ట మనస్కుఁడైనాఁడు. కర్ణునితో కరచాలనము గావించినాఁడు. సుయోధనుని వదనమును గని కర్ణుఁడు లోకభద్రప్రదంబగు శ్రీకృష్ణరాయబారము విఫలము చేసినాఁడని యెఱింగి వృద్ధ తపస్వి జాబాలి మండిపడుచు "సూతపుత్రా! నీవే కౌరవ పాండవ కలహమునకు కారకుఁడవు. భారతనాటకమునకు సూత్రధారుఁడవు. వివిధధర్మ విశారదులగు పితామహాదులు ధర్మమని యెంచిన దానికి నూతనసిద్ధాంతములు ప్రతిపాదించి రాయబారమును రాలపాలు సేయ నెంచితివి. నీ భుజబలమును నమ్ముకొని సుయోధనుఁడు యుద్ధమును కోరుకొనుచున్నాఁడు. నీవు నిస్తేజుండవైనఁగాని మహారాజు తన మతము మార్చు కొనఁడు. ధూర్తుఁడా! నీకు సహస్రాక్షుఁడిచ్చిన శక్తితోఁ గవ్వడి శిరంబు ఖండింప నెంచితివి కాఁబోలు! అయ్యది యతనిం గాక మఱొక్క యోధు నుక్కడగించుఁగాక! పురు హూతసుతుండు ఖాండవము దహించునప్పుడు పాఱివచ్చి నీ పంచఁజేరిన నాగమును నమ్ముకొన్నావు కాఁబోలు! అది వ్యర్థమైపోవుఁగాక! నీదుర్ణయమున కివే ఫలితములు." అని కర్ణుని శపించెను.

పాపము! దుర్యోధనుఁడు కర్ణునికి ప్రాప్తించిన యకారణ శాపవచనముల విని యదిరిపడినాఁడు. కర్ణుఁడేమాత్ర మును చలింపలేదు. కాని యతని మోమున నొక్కింత

విషాదరేఖ పొడకట్టకపోలేదు. అతఁడు మిత్రునికి ధైర్యముఁ జెప్పనెంచి "రారాజా! నిష్కారణముగా పాండవ పక్ష పాతివై న్యాయము దెలిపిన నిరపరాధిపై నలిగి యీ జడదారి పలికిన పలుకులు పాటిసేయవలదు. నీ వక్తవ్యాంశ ములు విశదీకరించుకొను" మనెను.

సభాసదు లెల్లరును కుతూహలముతో రారాజువంక చూచిరి. సుయోధనుఁడు నిజాసనమునుండి లేచి "యదు నందనా! మీవారి సందేశములును, మావారి యుద్దేశము లును గ్రహించితిమి. సమాధానపురస్సరములగు కర్ణుని పలుకు లాకర్ణించితివి గాదా! అర్ధరాజ్యమో, అయి దూళులో యిమ్మనియు లేదా సంగరమునకు సిద్ధము గమ్మనియు శత్రువులు కబురంపినారుగదా! నేను వారి కైదూళ్లిచ్చుట కంగీకృతుఁడ నైతినేని యుద్ధమునకు జంకి నట్లే కదా! సకల ధరానాయక మణిమకుట రంజిత చర ణుండనైన నాకు నీ రాయబార మవమానకరము. కౌర వులో కాక పాండవులో యెవరో యొకరు భారతదేశ సామ్రాజ్యమును పాలింపవలయును. అంతేకాని చేతి మీఁదుగా వాడి సూదిమొన మోపినంత వసుధయు నేను వారి కొసంగను. మీవారిచే నూడిగమే చేయించెదవో, యూళు లేలించెదవో యింక యోచించుకొనుము." అని తన నిశ్చయం బెఱింగించి కర్ణ శకుని దుశ్శాసనాదులతో సభవిడిచి వెడలిపోయెను.

శ్రీకృష్ణుఁడు వ్యర్థప్రయత్నుఁడైనాఁడు. కౌరవ పాండవయుద్ధ మనివార్యమని కురువృద్ధులు గుర్తించినారు.

## ద్వాదశ ప్రకరణము

సంధ్యాసమయము. భాగీరథీతీరమునసున్న యొక యిసుకతిన్నెపైఁ గూర్చుండి శ్రీకృష్ణుఁడు రాధేయుని రాక కెదురుచూచుచుండెను. అంతలోఁ గర్ణుఁడు సుందర స్యందనాసీనుఁడై యుత్తరయమున నచ్చటికి వచ్చెను. వాసుదేవుఁడు దరహాసవదనముతో నాతని కెదురేగి స్వాగత మిచ్చి తోడితెచ్చెను. మలయమారుతము మందమందముగా వీచుచుండెను. గంగాతరంగములు పొంగి పొరలుచుండెను. కృష్ణరాధేయు లిరువురు తెల్లని యిసుకతిన్నెలపైఁ గూర్చుండిరి.

"యదునందనా! నన్నిచ్చటి కేకాంతముగా రమ్మనుట కేమి కారణమో యెఱింగింతువా?" అని కర్ణుఁడు శ్రీకృష్ణు నడిగెను. మాధవుఁడు రాధేయుని వీపుదట్టి "అంగరాజా! నేఁడు నీ జీవితరహస్యము తెలుపనెంచి పిలిపించినాఁడను. నీవు క్షత్రియ పుత్రుఁడవు గాని సూతపుత్రుఁడవు కావు. కుంతికొడుకువుగాని రాధాత్మజుఁడవు కావు. ధర్మజాదులు నీ యనుజులు." అనునంతలో నాకాశవాణి 'సత్యము. సత్యము. సత్య' మని పలికెను. కర్ణుఁడు ప్రఫుల్లవదనుఁడై "బావా! ఆ విషయ మే నెఱుంగుదును. నేఁడు నీవు క్రొత్తగా చెప్పవలసిన దేమియు లేదు." అని పల్కెను.

“కర్ణా! నిన్నేకాంతముగా కలిసికొనుటలో నా యాంతర్యమిది. కానీనునకు జననిని పరిణయ మాడినవాఁడే జనకుఁడు. కనుక నీవు పాండవుఁడవు. న్యాయపథావలంబులగు నీ తమ్ములలో నిన్నుఁ జేర్చుటయే నా యుద్దేశ్యము. దుష్టుఁడగు దుర్యోధనుఁడు నీ సహజన్ములను మితిలేని వెతలు పెట్టుట నీ వెఱుంగనిది కాదు. భారత సమరము దాపరించుచున్నది. నీ తండ్రిపాలియని నీచులు స్వార్థ పిశాచులు నగు గాంధారేయులను పరిత్యజించి పాండవుల కండవైతివా బవరమే జరుగదు. ఈ ఘస్మాతలంబెల్ల సుభిక్షంబగు. జగద్రక్షణము జరుగును. నా పలుకులు పాటింపుము. నీ రాకను బంధువర్గ మందఱిచేత నొప్పించెదను. నీ జననిచేతను భానునిచేతను నీవు కౌంతేయుఁడవని నిరూపింపఁ జేయుదును. ప్రజ లెల్లరవలనను నిన్ను మెప్పించెదను. అఖిల భారత భూనేతవై నిఖిలరాజ్యమును నిస్తులవైభవమున నేలుకొనుము. మహాసమ్రాట్టువైన నిన్ను ధర్మరాజు వ్యజనము ధరించి కొలువఁగలఁడు. భీమసేనుఁడు దివ్యచ్ఛత్రముఁ బట్టఁగలఁడు. సర్వసేనాధిపతియై యర్జునుఁడు నీ యాజ్ఞానువర్తి కాఁగలఁడు. కవలు నీకు బాసటయై నిలువఁగలరు. మేమును నీ ప్రజలును నీకు జయము వలికెదము.

“బావా! ఏ రమణిని పరిణయమాడుటకు మున్ను ప్రయత్నించితివో, ఏ సుందరికై రారా జింతలు చేసెనో యా శుభాంగి యా లలనామణి నిన్నానవ భర్తగా స్వీక

రింపఁగలదు.'' అని మురారి యేమియో చెప్పఁబోవు నంతలోఁ గర్ణుఁడు చటాలున లేచి,

''గోపాలా! ఇఁక చాలును. కర్ణుఁ డంత కామాంధుఁడు కాఁడు. దురాశాపరుఁడు కాఁడు. ఆరాజ్య మేరికిఁ గావలయును? ఆ సౌఖ్యములకు సౌభాగ్యములకు నాశించి విశ్వాసద్రోహము సేయుమందువా! బుద్బుదప్రాయము లైన యైహిక సౌఖ్యములకై కృతఘ్నుఁడను కమ్మందువా? నన్ను త్రిజగతీ సామ్రాజ్య పట్టభద్రుని జేసినను విద్యుల్లత లగు విభవములకు 'దాసోహ' మనఁబోను. నాకు రాజ్యము నేలవలయునను కోరికలు తీఱినవి. నేఁడు రాజ్యలోభమునకు తలనొగ్గు నవసరము లేదు.

నేను కౌంతేయుఁడనే కావచ్చును. పాండవాగ్రజుండనై యుండవచ్చును. అయినను ప్రపంచము దృష్టిలో నేను రాధేయుఁడను; సూతపుత్రుఁడను. నందనందనా! ఒక పరి సూతపుత్రుఁడనైన నేను తిరిగి క్షత్రియకుమారుఁడ నగుదునా? అసంభవము. సర్వజనులకు సహజకాంక్షలైన పరిణయమును పుత్రోత్సవాదులును జరిగిపోయినవి. నేఁడు పరకాంతపై గాంక్షగలిగి పతితుఁడను కమ్మందువా!

''బావా! నా జననిపై యనుజులపై నా కాదరబుద్ధి యున్నది. అంతమాత్రమున సభానంతరమున నా యాత్మ గౌరవమును కాపాడి నన్ను భూనాయకుని గావించి యిన్ని నాళ్ళు నన్నే నమ్ముకొని తమ్ములకన్న మిన్నగా మన్నించి

న న్నింతవానిని జేసిన నా ప్రాణమిత్రుని నా సార్వభౌముని నా స్వామిని నట్టేట ముంచి వైరులలో చేరితినేని నా విశ్వాస ఘాతుకత్వమునకు ప్రాయశ్చిత్తముండునా? ఎవని దయవలన సకలసుఖము లనుభవించితినో, యెవని కరుణచే దానకర్ణుఁడ నని పేరుగాంచితినో, యెవని ప్రోత్సాహమున జైత్రయాత్ర గావించి విశ్వవిజయుఁడ నైతినో యా రారాజు ఋణము తీర్చుకొనవలదా? అతని యుప్పుపులుసుతోఁ బెరిఁగిన యీ శరీరము నతనికై యర్పింపవలదా?

"వాసుదేవా! సూతుని చేతికి దొరకితినే! సూతాంగన కడ పాలు ద్రావితినే! సూత సుదతిని పెండ్లాడి యామె యందు సుతులఁ గాంచితినే! అట్టి నేను నేఁడు రాజపుత్రుఁడ నని చెప్పుకొనిన నా బ్రతుకు నవ్వులపాలు కాదా! అట్లను టకు నా మనస్సు సమ్మతించునా! కృష్ణా! అర్జునుని నిర్జ రింతునని నా చక్రవర్తికి బాస చేసితినే! పార్థుని ప్రతిద్వంద్వి నని పేరందితినే! మఱి నేఁడు సమరము దాపరించు సమయ మున 'పాండవులు నా తమ్ములు; నేను కౌంతేయుఁడను' అని చెప్పుకొనుచు వారిలోఁ జేరితినేని కర్ణుఁ డర్జునునకు భయపడి యీ పన్నాగముఁ బన్నెనని ప్రపంచ మెలుఁగెత్తి పల్కదా? అంతకన్న యవమానము మఱొండు గలదా?

"బావా! ఆ యపకీర్తి నాకేగాదు. గాండీవికిమాత్రము రాదా? కర్ణునికి జంకి 'అన్న' యని కట్టుకథలు కల్పించి తమలోఁ గల్పుకొన్న పిఱికిపందయను ప్రచారము పుట్టదా?

"దుర్యోధనుఁడు నా ప్రభువు. నా ప్రభువునుసరించుటయే నా విధ్యుక్త ధర్మము. నన్ను కర్మవీరుని గానిమ్ము. స్వామిద్రోహము సేయుమని యింకొకమాఱు ప్రబోధింపవలదని వేడుచున్నాను." అని పలికి మిన్నకుండెను.

కృష్ణుఁడు చిఱునగవుతో "కర్ణా! నీ స్వామిభక్తి యద్వితీయము. కాని ఒక్కమాట - నీ ప్రభువుకోసమై నిరపరాధుల దండింతువా? అధర్మమును సమర్థింతువా? కన్నతల్లిని గాసిపెట్టెదవా? తోడిసోదరులఁ ద్రోసిపుత్తువా? రాజ్యశ్రీని చిన్నపుత్తువా? బావా! పిచ్చి పిచ్చి ప్రశంసలకు లోనై కచ్చెగట్టకుము. భగవానుఁడు న్యాయపక్షపాతియని నమ్మెదవుగదా! ఆ భగవంతుఁ డెవ్వరికి బాసటయై యున్నాఁడో తెలియునుగదా! జయశ్రీ యెవ్వరిని వరింపఁగలదో యిప్పుడైన నెఱింగితివా? ధర్మజుని జేరుట కింత దైన్యమందెద వేలనయ్యా! అందఱి మెప్పు లందుట కింత యాలోచన మేలనయ్యా! ఇఁక మఱుమాటాడకుము. పోవుదము రమ్ము." అని తిరిగి తనయ్యోకనిలో తా ననియెను.

కర్ణుఁడు తీక్ష్ణస్వరముతో "బావా! నా రారాజు నన్ను శాసించున దాచరించుటయే నా విధియని మరల నొకమాఱు అనుచున్నాను. ధర్మాధర్మముల కాతఁడే బాధ్యుఁడగునేమో? నా సుయోధనుని యాజ్ఞముందు నా ప్రాణమును తృణప్రాయమే. పలు పలుకులేల? అఘటనఘటనాసమర్థుండవును . సర్వలోకనాయకుఁడవును నగు భగవానుఁడవు

నీవు. నీ యనుగ్రహము వారియం దున్నదని యెఱుంగు దును. కాని యపజయమునకు జంకి మిత్రద్రోహి నగుటకు నా యంతరంగ మంగీకరింపదు. రాను. ముమ్మాటికి రాను. ఇది నా కృతనిశ్చయము. నన్నింక బాధింపకుము. నా యీ జన్మరహస్యము పాండవుల కెఱింగింపకుము. నా కనుజ్ఞ నొసంగుము. పోయి వచ్చెదను.'' అని శ్రీకృష్ణుని యనుమతి గొని నిజగృహోన్ముఖుం డయ్యెను.

## త్రయోదశ ప్రకరణము

ఇదేమి! ఈ మత్తగజ తండములేమి! ఈ జవనాశ్వ బృందములేమి! ఈ వివిధాయుధాగారము లేమి! ఈ సేనా వాహినులేమి! ఈ సింహనాదము లేమి! ఈ కల్లోలమేమి!

ఓహో! ఇది కురుక్షేత్ర మహాసంగ్రామభూమి కాఁబోలు! వీరు కౌరవవీరులా! దుర్యోధనుని సేనాముఖమున నిల్చుండిన యీ యతివృద్ధుఁడగు వీరమూర్తి శాంతనవుఁడు కాఁబోలు! ఇతఁడు కులాచార్యుఁడు కుంభసంభవుఁడుగదా! వీరు సుయోధనునికి సాయము సేయవచ్చిన గాంధార, కాశ్మీర, బాహ్లీక, సౌవీర, కాంభోజ, బర్బర, విదర్భ, కుంతల, కిరాత, చేది, ఘూర్జరాది వివిధ దేశాధీశ్వరులు. అదుగో దుశ్శాసనాదులు. వారిమధ్య రారాజు. పదునొకం డక్షౌహిణులు గల ప్రభువర్యుని మోమున విన్నదనము కన్పించుచున్నదే! కారణము? ఓహో! తన్నర్ధ

రథములలోఁ జేర్చిన కౌరవసేనాధిపతి గాంగేయునిపైఁ గినిసి కర్ణుఁడు సంగరరంగమునకు రాలేదనియా!

అది పాండవ స్కంధావారమా! తరుణుఁడగు నా శూరాగ్రేసరుఁడు పాండవసేనాపతి ధృష్టద్యుమ్నుఁడే! అతఁడు గంభీరమూర్తి భీమసేనుఁడు. వీరు ధర్మజుని పక్షమున వచ్చిన మగధ, మాళవ, నేపాళ, వారణాసి, సౌరాష్ట్రాది దేశాధి నాయకులా! అతఁడు ద్రుపదమహారాజువలె నున్నాఁడే! ఇతఁడు విరాటుఁడై యుండనోపు! వారే కృష్ణార్జునులు. వీరి సైన్య పరిమాణ మే డక్షౌహిణులా! సరే! ఇంతకు ధర్మరాజేడి? అదిగో యా ప్రక్క నేకాంతముగా నేమియో యోచించుచున్నాఁడు.

ఇరుపక్షములవారును రణశంఖములు పూరించిరి. యుద్ధభేరులు మ్రోగించిరి. భయంకర సంకుల భారత సమరము ప్రారంభమైనది. వీరావేశులగు యుద్ధభటుల హుంకారములతో జయఘోషలతో ధరిత్రి దద్దరిల్లి పోవుచున్నది.

అమ్మో! ఈ భీభత్సమేమి? ఎటు చూచిన మొండెములే! నఱుకఁబడిన కాలుసేతులే! ఎగురఁగొట్టఁబడిన శిరములే! చూర్ణములైన రథరథాంగములే! భూమిపై విఱుచుకొని పడిన వేదండములే! ఎల్లెడల పీనుఁగు పెంటలే!

భారతయుద్ధ మారంభమై పదిదినము లైనది. పాండవ సైన్యము సగభాగము రణభూమికి బలియై పోయినది. నాఁడు

పాండవ పక్షపాతియగు భీష్ముఁడు స్వీయ మరణ మర్మము శాత్రవుల కెఱింగించెను. తదనుసారముగా శ్వేతవాహనుఁడగు నర్జునుఁడు శిఖండిని ముందుంచుకొని ధనుస్సు త్యజించిన పితామహుని వాఁడి నారాచములతో విజితుని గావించెను.

అనంతరము కౌరవ సైన్యమునకు ద్రోణాచార్యుఁడు నాయకుఁ డయ్యెను. అమ్మహామహుఁ డప్రతిహత పరాక్రమముతో నాల్గు దినములు ఘోరముగాఁ బోరుసల్పెను. కడ కతి కఠోరవార్త యమాత్మజుని నోటినుండి వెడలఁగనే యాతఁ డస్త్రసన్యాసము గావించెను. ఆ యదనున ద్రోణుని జంపుటకై జన్మించిన ధృష్టద్యుమ్నుఁడు తన కర్తవ్యమును నెఱవేర్చుకొనెను.

మహాభారత సంగ్రామములో పదునైదవ దినము. నాఁడు కౌరవసేనాసమూహము నూతనోత్సాహయుతమై యుండెను. నేఁడు కౌరవసేనాపతి మహారథి కర్ణుఁడు కాఁబోలు!

ఆకసమున నేదియో కలకలము బయలుదేరిన దే! సురగరుడోరగ గంధర్వ కిన్నర కింపురుష విద్యాధర బృందములు కర్ణార్జునుల మహాసంగరముఁ దిలకింప వచ్చినవి.

ఇదిగో దిగ్విజయయాత్ర చేసిన దిట్ట. అతిరథప్రవరుఁడగు నాదిత్యనందనుఁడు తన రథము నటు పోనిమ్మని సారథి కాజ్ఞాపించినాఁడు. ఇంత కిక్కడ కవ్వడి లేఁడు. అతఁడు దూరమున మరే యోధునితోనో తలపడి యుండవచ్చును!

కర్ణుఁ డాకృతి ధరించిన వీరరసము వలె ప్రచండ మార్తాండ తేజుండై స్వైరవిహారము సల్పుచున్నాఁడు. ఆ మహారథి ఖడ్గమున కెదురులేదు. అతని యనర్గళ మార్గణా సారమున కాటంకములేదు. నాఁటితో యుద్ధ మంతమగునట్లు తోఁచినది. పాండవసేనలలో హాహాకారములు చెలరేఁగినవి.

కర్ణుని యప్రతిమాన ప్రతాపమునకు వెఱగంది చెల్లాచెదరగు సైనికులఁ బురికొల్పుచు ధర్మజ భీమ నకుల సహదేవు లతనిని మార్కొనిరి. మహారథి వారల నెల్లర నేకకాలమున నోడించి పరిహాస వచనములతో పరాభవించి తల్లికి తానిచ్చిన వరము గుర్తుకుఁ దెచ్చుకొని విడిచిపుచ్చెను. సూతసుతుని చేతిలో తనసోదరు లవమానమందుట విని సవ్యసాచి యటు బయలుదేఱుచున్నాఁడు. అదిగో! ప్లవంగ పతాకము! అదుగో! శ్వేతాశ్వముల నదలించుచు ముందున్న ముకుందుఁడు! గాండీవి కర్ణుని దాపునకు వచ్చుచున్నాఁడు. కర్ణార్జునుల పోరుగాంచుటకై యిరుపక్షముల వారును యుద్ధము చాలించినారు.

అయ్యో! వారి కాశాభంగ మైనదే! అదేమి! కిరీటి రథము వెనుదిరిగి పోవుచున్నది. అర్జునుఁడు తన సారథితో నేమియో యనుచున్నాఁడు.

"బావా! కర్ణుఁడు ప్రళయకాల కాలునింబోలి విజృంభించుచున్నాఁడు. నేఁ డితనిముందు ముల్లోకము లొక్కటై వచ్చినను నిలువఁజాలవు. నేఁటికి బ్రతికి బయటఁ

బడిన రేపు బలాబలములు చూపుకొనవచ్చును. రథము
శిబిరమునకుఁ బోనిమ్ము."

"పార్థా! పారిపోకుము. వీరధర్మ మతిక్రమింపకుము."
అని మహారథి కర్ణుఁ డనుచున్నాఁడు. ఆ మాటలలో తన
సహోదరుఁ డింత పిఱికిపందయా యను నావేదన ప్రకటిత
మగుచుండెను.

అది పదునాఱవరోజు. నాఁడు నకులసహదేవుల మేన
మామయగు శల్యుఁడు రాధేయుని రథసారథి యయ్యెను.
శల్యుఁడు పాండవపక్షపాతి. నాఁటితో యుద్ధము నంతముఁ
జేయవలయునని కర్ణుఁడు తొందరపడుచుండెను. క్రిందటి
దినమున కర్ణునిచే పరాభూతుఁడైన ధర్మరాజుచే పోటు
మాట లనిపించుకొనిన యర్జునుఁడు మహోద్రేకముతో తన
సర్వశక్తులు సమీకరించుకొని సమరము సేయవచ్చెను.

ఇట కర్ణ శల్యు లేమియో సంభాషించుకొను
చున్నారు.

"సారథీ! మద్రేశ్వరా! రథ మర్జునుని కడకుఁ
బోనిమ్ము."

"అమ్మో విజయుని కడకే! కర్ణా! నీకు మతిపోయి
నదా? అగ్నిలో శలభము దూఁకినట్లు సవ్యసాచికడకు నీవేల
నయ్యా! ఈ యనామక భటులతోఁ బోరినఁ జాలును!
కోరికోరి మృత్యుదేవత విషదంష్ట్రలలోఁ బడనేల!

"శల్యా! సారథి ధర్మమును విస్మరించి నిరుత్సాహ

వాక్యము లాడుచున్నావు!"

"కానిచో సూతపుత్రా! నీకును వాసవి సుతునకును బోరాటమా!"

"కలుషాత్ముఁడా! ఈ నిర్వీర్యవచనము లేమిటి? ముందు రథము పార్థునికడకుఁ ద్రోలుము."

"ఇడుగోనయ్యా! ఘటోత్కచుఁడు! ఇతనిని గెల్చినఁ జాలును. అర్జునుని గెల్చినంత బలవంతుఁడవే!"

అంతలోనే హైడింబుఁడు మాయాసమర మారంభించినాఁడు. రంగమునెల్ల తమోమయముఁ జేసినాఁడు. గగనమునుండి రక్తవర్షము కురిపించుచున్నాఁడు. కౌరవసేన పలుచఁబడుచున్నది. కొలఁది నిమేషములలో కొన్ని యక్షౌహిణులు కూలిపోయినవి. "రారాజా! రక్షింపుము. కర్ణా! కావుము." అను నార్తనాదములతో కౌరవసేన నలుదిశలకుఁ బాఱుచున్నది.

దుర్యోధనుఁడు కర్ణునికడకు వచ్చి మంత్రాలోచనము గావించుచున్నాఁడు. "సమయ మతిక్రమించు చున్నది. కర్ణా! నేఁటితో మన యాశాసౌధములు నేలమట్టము లగునట్లున్నది. దేవేంద్రుఁ డిచ్చిన యమోఘశక్తి భీమపుత్రునిపై సత్వరము ప్రయోగింపుము." అని రారా జనెను.

"ఇది పార్థునికోస మెంతకాలమునుండియో దాఁచి యుంచితినే.!" అని కర్ణుఁడు తన యభిప్రాయ మెఱింగించెను.

"నేఁడు బ్రతికియున్నఁగదా! యర్జునుని బరి మార్చుట! అవశ్యము కానిమ్ము." అని రారాజు పలికెను.

అమోఘశక్తి రాక్షససంహారముతో తృప్తిపడినది.

ఇంతలో పుత్రమరణశోకసంతప్త మానసుఁడగు భీమసేనుఁడు మండిపడుచు కర్ణు నెదుర్కొనినాఁడు.

శల్యుఁడు "కర్ణా! తప్పుకొని పోవుదము రమ్ము. ఇతని కొమరునిఁ జంపుటకే యమోఘశక్తి నుపయోగించితివే! ఇఁక నీతనికొఱకు నీ జీవశక్తి నర్పింపవలసినదేగా!" అని పలికెను.

మహారథికి నవోత్తేజకరములు భావోద్వేగదాయకములు నగు సంభాషణలు సాగింపవలసిన సారథి యిట్టి విపరీతవాక్యము లాడుచుండ రథి రణ మెట్లు సేయఁగలఁడు?

పాపము! వీరాధివీరుఁడగు రాధేయుఁడు విజృంభించుటకు వీలు కాలేదు. పాండవులను కనుఁగొనునప్పుడెల్ల "వీరు నా తమ్ములే కదా" యను ప్రేమభావ ముదయించెడిది. కాని యది స్వధర్మనిర్వహణమున కడ్డురాలేదు.

అదుగో! మహారథి కర్ణుని పురందరనందనుఁడు ప్రతిఘటించుచున్నాఁడు. ఎన్నిదినములనుండియో పూజించుచు దాఁచియుంచిన నాగాస్త్రము నర్జునుని కంఠమునకు కర్ణుఁడు గుఱిపెట్టినాఁడు.

"గొప్ప ధనుష్కపాండితుఁడవేనయ్యా! లక్ష్యము కుదరలేదు. మఱికొంచెము పైకి గుఱిపెట్టుము." అని

శల్యుఁడు ప్రబోధించి కర్ణునిచే నట్లు చేయించినాఁడు.

సూర్యసుతుఁడు మహోరగాస్త్ర ప్రయోగము గావించినాఁడు. అది గాండీవి మస్తకమును ఖండించునా!

ఔరా! ఏమి చాతుర్యము! ఏమి సమయస్ఫూర్తి! శ్రీకృష్ణభగవానుఁడు రథమును కాలి బొటనవ్రేలితో నాలు గంగుళములు భూమిలోని కదిమినాఁడు. నాగాస్త్ర మర్జునుని కిరీటమును దూసికొని పోయినది.

అది వ్యర్థమైనంతనే కర్ణునికి పట్టరాని యాగ్రహము కలిగినది.

"శల్యా! రథ మింక కొంచెము ముందునకుఁ ద్రోలుము. పార్థునితో ద్వంద్వయుద్ధము సేసెదను." అని పలికెను.

"రాధేయా! అది నీతరముగాదు. ఫల్గునుఁడు ఫాలాక్షుని నిర్వ్యారించిన మేటి. అతనికి నీవు సాటియా!" అని శల్యుఁ డనెను.

"సారథీ! నీ వ్యర్థప్రసంగమాపి మాయాజ్ఞ నిర్వర్తింపుము." అని కర్ణుఁ డతనిని మందలించెను.

భాస్కరాత్మజుఁడు భీషణమూర్తియై నిప్పులు గ్రక్కుచుండెను. నిజప్రతాపాతిశయమున దుర్నిరీక్ష్యుఁడైన నీరజమిత్రునివలె నున్న కర్ణునిగని పార్థుఁ డొక్కింత భయపడెను.

కర్ణార్జునుల సమరము దివ్యులకు కన్నుల పండువుగా

నుండెను. ఆగ్నేయాస్త్రమునకు వారుణాస్త్రమును, నాగాస్త్రమునకు గారుడాస్త్రమును, ప్రభంజనాస్త్రమునకు బ్రహ్మాస్త్రమును నిత్తెఱంగున నా వీరశేఖరులు ప్రయోగించుకొనుచుండిరి.

అంతలో కర్ణుని రథచక్రములు భూగర్భములో క్రుంగిపోయినవి. కర్ణుఁడు రథము దిగెను. అస్త్రమంత్రములు స్ఫురించుటలేదు. భూసుర గురుశాప ప్రభావము కాఁబోలునని యతఁ డనుకొనెను.

"అర్జునా! ముహూర్త మాత్రము శరప్రయోగ మాపుము. నా రథచక్రము లెత్తుకొని వెండియు భండన మాచరింతును. రథి భూమిష్ఠునితో బవరము సేయుట పాడిగాదుగదా." అని పలికి రాధేయుఁడు నిజభుజాగ్రమున రథచక్రము లెత్తఁ బ్రయత్నించెను. గిరిగహ్వరార్ణవ నగర ద్వీపసహితమగు ధరణీతలంబెల్ల నాలు గంగుళములు పైకి లేచినది. కాని కర్ణుని రథచక్రములు మాత్రము పెల్లగిల లేదు. కర్ణుఁడు నిస్పృహుఁడై "శల్యా! రథముపై నున్న గదాదండ మిమ్ము." అని సారథి నడిగెను.

"కర్ణా! ఆ మాట పెద్దగా ననకుము. భీమసేనుఁడు వినెనా నిన్నింక బ్రతుకనీయఁడు." అని శల్యుఁడు మహారథికి మనశ్శల్యుఁడై పలికెను.

అంతలో నజేయుఁడైన రాధేయుని ఈ యదనునఁ దప్ప నింక సంహారింపలేవు. వెంటనే యాతనిం జంపుమని

కృష్ణుఁడు పార్థుని హెచ్చరించెను. విజయుఁడు శరము ప్రయోగించెను. నిరాయుధుఁడై నిస్సహాయుఁడై యున్న కర్ణుఁడు గాండీవి నిశిత బాణాఘాతమున "హా! రారాజా!" యనుచు నేలపై కొరిగెను.

తనయుని యవస్థఁ జూడలేక దివాకరుఁడు పశ్చిమ సముద్రమున మునిఁగెను.

## చతుర్దశ ప్రకరణము

అది యుద్ధరాత్రి. ప్రపంచమెల్ల నంధకారబంధురమై యుండెను. రణక్షేత్రమున కించుక దూరమునఁగల పాండవ శిబిరములలో చిన్నిదివ్వెలు మినుకు మినుకు మనుచుండెను. సైనికు లెల్లరు నానందపరవశులై మేనులు మఱచి నిదురించుచుండిరి. మహారథులు నాఁడు తమకు ప్రాప్తించిన ఘన విజయమును దలంచుకొని నూతనోత్సాహులై ముచ్చట లాడుకొనుచుండిరి.

నరనారాయణు లొకచోఁ గూర్చుండి నాఁటి సమర క్రమమును స్మరణకుఁ దెచ్చుకొనుచుండిరి. గాండీవి ముఖమున గర్వరేఖలు ప్రస్ఫుటించుచుండెను. "బావా! సారథివై సచివుఁడవై చక్రరక్షకుఁడవై యెనలేని సహాయముఁ జేసితివి. నీ సహకారమున నేఁటికి నా ప్రధాన ప్రతిపక్షిని పరాభూతుని గావింపఁగల్గితిని. తొలుతనుండియుఁ గల్గిన గండములు నీ కరుణాప్రభావము చేతనే గదా గడచిపోయి

నవి. ఇఁక సమరభారము చాలవఱకుఁ దీరినట్లే!'' అనుచు కవ్వడి శ్రీకృష్ణుని బ్రస్తుతింపసాగెను. కమలాక్షుఁడు సురేంద్రసూతిని గౌరవదృక్కులతో నవలోకించి ''పార్థా! కర్ణపర్వము గడచుటలో నీప్రతాపమును నా ప్రతిభయును సమర్థములు కాలేదు. శాపమిచ్చిన జామదగ్నియు, కవచ కుండలము లపహరించిన వాసవుఁడును, నిరుత్సాహ వచనములాడి కొంత నిర్వీర్యుని గావించిన శల్యుఁడును, రథ చక్రములు తనలో నైక్యముఁ జేసికొనిన ధరణీదేవియును కారకులే. వారెల్ల నీకు తోడునీడలై యుండి కాపాడినవారే!

''పాపము! కర్ణుఁడు దైవోపహతుఁడు. కానిచో నిరుపమాన శౌర్యధారేయుని రాధేయుని నిర్జించుట నీతరమా! చందనవృక్షమును విషసర్పము చుట్టియుండునట్లు లామాన్యుని దుర్యోధనుఁడు వలలో వేసికొని యింత చేసినాఁడు. దుస్సాంగత్యము దుర్గతిఁ గూర్చినది.'' అని పలికెను. ఈ పలుకు లాలకించుచున్నకొలఁది పార్థుని తలపై నసూయా పిశాచి తాండవము ప్రబలమగుచుండెను. విరోధి ప్రశంసలు విని యుపేక్ష వహించుట విజయుని కెంతయో యవమానకరముగాఁ దోఁచినది.

అతఁడు మొగము చిట్లించుటఁగని శ్రీకృష్ణుఁడు ''బావా! ఉన్నమాటన్న నీకింత యులుకేలనయ్యా! రాధేయుఁడు నీకు విరోధికావచ్చును. అంతమాత్రమున నాతని సహజసద్గుణ ప్రస్తావన నీకు కర్ణకఠోరముగా నుండుట

భాష్యమా ?'' అని మఱికొంత రెచ్చఁగొట్టెను.

పార్థుని తల తిరిగిపోవుచున్నటు లుండెను. అతఁ డింక సహనము వహింపలేక "బావా! సూతసుతు నొకనిని పురుహూత పుత్రుని ముందు పెద్దఁజేయుచున్నావు. అతఁ డేమి యాఖండలు నోడించి ఖాండవము దహించినాఁడా? త్రిపురవైరి నెదిరించినాఁడా? అమరనేత యర్ధాసన మధిష్ఠించినాఁడా? భీష్మాది యతిరథప్రవరుల నొక్కఁడే విజితులం గావించినాఁడా" అని యావేశ స్వరముతో ననియెను.

శ్రీకృష్ణుఁడు పార్థుని మాత్సర్య పూరిత వచనము లాలకించి "బావా! దాని కేమి! కర్ణుఁడు మాత్రము సామాన్యుఁడా? జరాసంధుని బరాజితుని గావింపలేదా? అఖిల దిగ్విజయయాత్ర చేసి కురువిభునిచే వైష్ణవయాగము సేయింపలేదా? అతఁడు పరాక్రమశాలి మాత్రమే కాదు. దేవతా చక్రవర్తిని దిగ్భ్రమనొందించిన దానశీలుఁడు కూడ! అతఁడు భుజబలమందే కాదు—ఆత్మబలమునందుఁ గూడ నసమానుఁడు. వీరత్వమే కాదు ధీరత్వముకూడ నాతనికి భూషణమే! కాని దుర్లంఘమగు విధివైపరీత్యమున నతని కన్నిట నపకారములే జరిగినవి."

ఇట్లు మాధవుఁడు రాధేయుని నుతించుచున్న కొలఁది పాండవమధ్యమున కీర్ష్య యెండగుచుండెను. "బావా! ఇఁక చాలును. 'కర్ణుఁడు రణశూరుఁడు—దానవీరుఁడు.' అని

కదా యిపు డంటివి. నేటి యుద్ధముతో నాతని శూరత్వము పేరు మాసిపోయినది కదా! నేటితోనే యాతని దానవీర బిరుదము కూడ నాశనము కావలయునులెమ్ము. రణాంగ మున కరిగి రాధేయుని వదాన్యతఁ బరీక్షించి వత్తము. రమ్ము. అనుచు బ్రాహ్మణవేషములు ధరించి వాసవసూతి వాసుదేవుని వెంటఁబెట్టుకొని పొలికలని కరిగెను.

ఆ భయంకర కాళరాత్రిలో, నా దారుణ రణక్షేత్ర ములో, నా భీభత్స వాతావరణములోఁ గ్రిందపడి యింకను ప్రాణములుపోక యున్న కర్ణుఁ డా బ్రాహ్మణద్వయము రాక నల్లంతదూరముననే గమనించినాఁడు. శోచనీయా వస్థలోనున్న కర్ణుని గనునప్పటికి కృష్ణుని కన్నులనుండి రెండు వేఁడి కన్నీటిబిందువులు జారిపడినవి. అతని నోట మాట వెడలలేదు. అర్జునుఁడు ముందుకువచ్చి "కర్ణా! మేము నిన్ను తుదిసారిగా చూచిపోవచ్చితిమి." అనియెను. కర్ణుఁడు మందస్వరమున "ఆర్యులారా! మీకు నాపైఁగల యభిమానమునకు చాల సంతోషము." అని పలికెను.

పార్థునికి తాను వచ్చినపని తత్క్షణము సానుకూలము చేసికొనవలయునను కాంక్ష మితిమీఱెను. అతఁడు "రాధేయా! నీవు జగదేక దానవీరాగ్రేసరుఁడ వని పిన్న నాఁది నిన్నే దే నొకటి యాచింపఁదలంపు కల్గినది. ఇప్పు డందులకే నీకడకు వచ్చితిని. దయయుంచి నాకు స్వర్ణ దానముసేయుము" అని యడిగెను.

కర్ణుఁ డాశ్చర్యపడెను. "అక్కటా! రణభూమిలోఁ బడియుండి మఱికొన్ని క్షణములలో ప్రాణమువిడు నేను స్వర్ణదానము నెట్లు సేయఁగలను? నా కిదియొక యగ్ని పరీక్ష కాఁబోలు! కానిమ్ము. కర్ణుఁ డంత్యకాలమునఁ గూడను 'దానకర్ణుఁడే' యను పేరు నిలువఁ బెట్టుకొనఁ గలుగునట్లు పరాత్పరుఁ డనుగ్రహించుఁగాక!" అని స్వగతమునఁ దల పోసి తన నోటియందున్న బంగారు పంటిని దీసి దానముగా నీయ సంకల్పించెను.

వెంటనే తన బిగించిన పిడికిటితో దవడపై గట్టిగా గొట్టుకొనెను. బొటబొట ప్రవహించు రక్తముతోఁ బాటు యూడిపడిన బంగారుపంటిని చేతనుంచుకొని "ఆర్యా! అదుగో! అట పడియున్న ధనుర్బాణముల నిటు దెమ్ము. రక్తమాంస పంకిలమైన దీనిని నా వింటిదెబ్బకు పొంగివచ్చు పాతాళగంగలో పరిశుభ్ర మొనరించి నీకు దానము సేయుదును." అని పలికెను.

కృష్ణుఁడు గన్నార్పక నీ సాహసమును గాంచుచుం డెను. అర్జునుఁ డందించిన ధనుస్సు నెక్కువెట్టి కర్ణుఁ డొక బాణమును ప్రయోగించెను. తదాఘాతమున పాతాళగంగ బుస్సుమని పై కుబికెను. ఆ పవిత్రజలముతో తనపంటిని శుద్ధముచేసి కర్ణుఁ డర్జునునకు స్వర్ణదానము చేసెను. తన యౌదార్యమునకు వెలవెలఁ బోవుచున్న వా రిరువురు బ్రాహ్మణులు కారనియు కృష్ణార్జును లనియు నతఁడు తెలిసి

